సీ. శ్రీమించు నెమ్మోము తామరవిరి తళుక్కఁ
గన్నులు విరిసినకైరవములు
కుదురైన రదనముల్ కుందకుట్మలములు
తీరైన నాసిక తిలసుమంబు
తళుకాధరోష్ఠంబు దాసానిపుష్పంబు
పొలుపైన పొక్కిలి పొన్నపువ్వు
ఆదోఁక లగుజంఘు లరఁటి పూమొగ్గలు
చక్కన్ని మెయి శిరీషప్రసూన
గీ. మహాహా ఘను మంచిమంచి పూలరసి తెచ్చి
పొదవి నెమ్మేనుఁ జేసెఁగాబోలు బ్రహ్మ
దాన నిలగల యెల్ల సుందరులలోన
మాకు స్పృహణీయవైతి రామావధూటి.
సీ. నారంగములు బృహన్నారంగములుగల్గి
విలసిల్లు నుద్యాన వీథులందు
కాదంబములు పద్మకాదంబములు గల్గి
తనరారు కాసార తటములందు
పర్యంకములు మహాపర్యంకములు గల్గి
వినుతికెక్కిన సౌధవీథులందు
మణిపుత్త్రికలు నభోమణి పుత్త్రికలు గల్గి
సొరుమీరినచంద్రశాలలందు
గీ. మనముమనముల మోహ ముమ్మరముగాఁగ
మరునిఁబూజించి మించి యేఱి రతుల
సతులగతులను దేలి సమ్మతుల మీఱి
తివినుంటిమి గదవె రామావధూటి.

## ప్రతాపరుద్రచక్రవర్తి.

సీ. పూర్వాపరాబ్ధులు పొలిమేరలై యుండ
నేరాజు జగమెల్ల నేలఁగల్గె
లక్షింపఁ దొమ్మిదిలక్షలవిలుకాండ్రు
నేరాజుబలములో నెలమిఁ గలరు
ధరణి డెబ్బదియేడుగురు నాయకోత్తము
లేరాజు సేవింతు రిచ్చగించి
దాక్షిణాత్యులనెల్లఁ దఱిమి జయస్తంభ
మేరాజు నిల్పె రామేశ్వరాన
గీ. అతఁడు కాకతివీరరుద్రావనీశుఁ
డమ్మహారాజు చెప్పంగ నలరె ధాత్రి
రాజశేఖరుఁ డెంతయు రమణతోడ
జగముపాలించు భూలోకచక్రవర్తి.

## మైలమభీమన.

ఈతనిపేరఁ గల్గుపద్యములు ("గరళపుముద్ద—" ఏఱువభీమ—) వే(లే)ములవాడభీమకవికృతములుగా లక్షణగ్రంథములం దుదాహరింపఁబడినవి. ఈ క్రింద నుదాహరింపఁబడుపద్యములెల్ల నొక్కపేరుసలోనివే యగుటచే నొక్కరిచేతనే (భీమకవిచేత) రచియింపఁబడిన వనుకొనెదను. భీమకవిపద్యములు సాహిణిమారన, చాళుక్యచొక్కభూపతి, సాగిపోతరాజు, కళింగగంగు (చోడగంగఁడు) తెలుంగాధీశుఁడు, మైలమభీముఁడు, ననువారికిఁ బ్రసక్తించినవి యగుటచేత, నాయందఱు సమకాలమువారు కాఁదగుదురు. భీమకవినిగూర్చి "ప్రబంధరత్నావళి" పీఠికలోఁ గొంత విస్తరించి చర్చించియున్నాను. విజయనగరసంస్థానప్రభువులగు పూసపాటివారి మైలమభీమనసంబంధులట ! ఈతఁడు ఏలేరు, కనిమి, వేంగి, కళింగలను జయించినట్లు పద్యములం దున్నది. ఏఱువభీమ మైలమభీమ, పదము లొక్కనిపేళ్లే.

ఉ. యాచకఖేచరుండు సుగుణాంబుధి పైలమభీముఁ డీల్గినన్
జూచి వరించె రంభ యెడఁజొచ్చెఁదిలోత్తమ; దారినిద్దఱన్
డ్రోచె ఘృతాచి ముగ్ధలకు దొడ్డడి కయ్యెనుపుల్ల్టెన్తిలో
నాఁచుకుపోయె ముక్తిసతి సర్వరి యద్దశఁ జూచి నిర్జరుల్
నోఁచినవారిసొమ్ము లవి నోమనివారికి వచ్చునే ధరన్
[ఇందలికడపటిచరణము నాచనసోముని హరివంశమందునుగలదు.]

చ. అహితులఁ దాఁకి పోరునెడ నంబుధికల్గినసాఁటిరాము గో
గ్రహణమునాఁటిపార్థు గదఁగాఁ గొరవుసేసిననాఁటిభీము నా
గ్రహ మెసగం బురత్రయముఁ గాల్చిననాఁటిఫాలలోచనున్
మహి నుపమింపఁగాఁ దగునె పైలభీముని భీమవిక్రమున్.

ఉ. పన్ని తురంగమంబునకుఁ బక్కెర వెట్టినవార్త చారుచే
విన్న భయంబునంగలఁగివేసటనాఁటనె చక్ర(?)గోట్టముల్
మన్నియపట్టణంబులును మక్కిన వేంగి కళింగ లాదిగా
నిన్నియు నొక్కపెట్టైగసె నేలువభీమనృపాలు ఘాటికిన్

క. అరినరు లేలువభీముని
పొరువున మనలేరు చిచ్చుపొంతను వెన్నై
తెరువునఁ బైసరై జూదరి
సిరియై రేవ్చెట్టుక్రింద జిల్లేడుచెట్టై.

ఉ. ఆలములో నరాతులకు హమ్మని మార్కొనవచ్చునే మహా
కాళికి శూలికిన్ బ్రళయకాలపుగాలికి రాఘవేంద్రుబా
ణాళికిఁ బక్షినాయకునఖాళికి మత్తగజేంద్రవైరిదం
ష్ట్రాళికి దావపావకశిఖాళికి పైలమభీమువాలికిన్.

ఉ. సేరుపు బ్రహ్మఁజేరె నిజనిర్మలతేజము సూర్యులజేరె నా
కారము కాముఁజేరె నధికం బగులక్ష్మి యనంతుఁజేరె గం/

క్షీరత వార్ధిఁ జేరెఁ గలపెంపు కులాద్రులఁ జేరెఁ గీర్తిదా
నూఱటు లేక త్రిమ్మరుచు నున్నది మైలమభీముఁ డీల్గినన్.

చ. గరళపుముద్దలోహ మనగాఢమహాశనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్ని కొల్మి యురగాధిపుకోఱలు పట్టుకార్లు ది
క్కరిపటిశిరంబు దాయ లయకాలుఁడు కమ్మరి వైరివాసు
హరణగుణాభిరాముఁ డగు మైలమభీమనఖడ్గసృష్టికిన్.

మ. తెరలం బాఱె నభంబు దాఁకినఁ బయోధిం జొచ్చినన్ శైలగ
హ్వరముల్ దూఱినఁ జిక్కభీముఁడు నృపవ్రాతంబుఁ బోనిచ్చునే
గరుడండై చని పట్టు మింటికుద నుగ్రగ్రాహమై చొచ్చి సా
గరమధ్యంబునద్రమింగుఁ బట్టుకొను సింగంబై గుహాంతంబునన్.

క. ఆలమునఁ జిక్కభీముఁడు
నా లతివేగమునఁ బెటికి నడితుజగవియన్
త్రేలిపడఁ బడుగు నేసెను ?
ఏలేరును గసిమి భైరవేశుం డెఱుఁగన్

ఉ. వీరగుణప్రతాపగుణవిశ్రుత! మైలను భీమ నీయశం
బారభమానతారకరహారవిలాసము నీనికేతనం
బాభమానతారకరహారవిలాసము నీభుజార్గళం
బారభమానతారకరహారవిలాసము చిత్ర మిద్ధరన్.

ఉ. భండనభీమ నీయెదుర బాఱక నిల్చినశాత్రవుల్ బ్రహ
న్మండలపుండరీకపురనాకనివాసులు నోర్చినన్ బ్రహ
న్మండలపుండరీకపురనాకనివాసులు చచ్చినన్ బ్రహ
న్మండలపుండరీకపురనాకనివాసులు చిత్ర మిద్ధరన్.

చ. విదితగురుప్రతాపగుణవిశ్రుత మైలమభీమభూప నీ
పదిలపుఖడ్గదారఁ దెగి పాటినవీరుఁడు గోపురంబుపై

విదితసువర్ణరత్నమయవేదికమీఁదను నిల్చి కాంచు నా
పదిపదు లగ్నిహోత్రులను బన్నిరుసూర్యుల నూఱుచంద్రులన్.

చ. అసమునఁ గాసికాసగరమం దసువుల్ త్యజియించినంతనే
యసదృశ మైనకన్నుగల దచ్చట మైలమభీమభూప నీ
యసిఁ దెగిపడ్డవైరులకు నంబకముల్ పదినూఱులయ్యె నీ
యసికిని వారణాసికిని నంతర మెంత దలంచిచూచినన్.

మాచయబ్రహ్మఁడు.

ఈతఁడు, నాచనసోమునివసంతవిలాసకృతికిఁ బతియని, యాగ్రంథ
మందలి మొదటిపద్యమిది యని శ్రీరామకృష్ణకవిగా రుదాహరించినారు.

శా. శ్రీచన్నుంగ్రవ్రేకపుఁ గ్రొమ్మెఱుఁగులన్ శృంగారపుందోఁటకున్
బ్రాచీనం బగుచున్నవింశతినఖప్రోథిన్ సుఖాంభోధివే
లాచంద్రోదయమైనదేవుఁడు కృపాలంకారచిత్తంబునన్
జూచున్ మాచయబ్రహ్మధీమణిఁ గవిస్తోమైకచింతామణికిన్.

ఈతనిఁగూర్చి చాటువు:—

సీ. కమలంబునకుఁ బుట్టి కమలంబుచుట్టమై
కమలంబు తననాభిఁ గాంచిగాక
గంగకు నుదయించి గంగ నౌదలఁదాల్చి
గంగలోఁ భువనంబు గలపిగాక
జలరాశి జన్మించి జలరాశి లంఘించి
జలరాశి బాణాగ్నిఁ జమరిగాక
వహ్నికి నుదయించి వహ్ని నెచ్చెలిఁ జేసి
వహ్ని ఖాండవముపై బ్రాఁకిగాక

గీ. ఊర కెవ్వారు నీతోడ నీగరయువారు
బుద్ధితేజోరమాశౌర్యభూతి యత్న

కాంతి విక్రమఖ్యాతి సంగతుల నలరి
ప్రాభవోదార! మాచయబ్రహ్మనృప.

సీ. బలిమిఁ బ్రతాపరుద్రునికోలువునాయంకుల
కుంచెలు మాన్పినగురుభుజుండు
భువి దొడ్డమాచెమ్మ కవిని దూరుచు నగ్ర
ప్రకట విద్వేషినాయకులమగఁడు
ఎలమి డెబ్బది యేడ్గురు దలరాచఁ గొల్చిరా
రుద్రదేవుని యొద్ద భద్రగజము
పరతేర నడచుఁ బాలంగఁ గరిఁ ద్రోచి
హరిదంతి భీమాంకుఁ డనఁగఁబరఁగి

గీ. ధరణిలోన వెలయుచండాడుగండాంక
భీమనృపతిపుత్త్రి పృథులగోత్ర
పోతుగంటిమైలభూపాల! నీచేతి
పోతి కెదురు విల్వ నెందులేరు.

సీ. మానికొండోద్ద మన్నెవేశ్యాభుజం
గాంకుబొమ్మయదేవు నాజిఁ బరపె
ఈసునఁ బైపడ్డబోసంగికడదాఁక
పరఁగ మంగయనేని భంగపఱచె
పోరిలో మెఱయుకొండూరినల్లయరెడ్డి
... వెసఁజీమ లేటిబయల
మప్పురపల్లొద్ద మద్య భీతిఁ బైపడి
ఢిల్లితురుష్కుల త్రుళ్లడంచె
ఢిల్లిలో తెలుగుబిజ్జ లన్నృపాలుని గెల్చి
తావిళలకీర్తిధర్మగతిని నిల్పె?

గీ. భీమభూపాలసుతుఁడు తద్భీమబలుఁడు
వైరిగజభీముఁడమిత సత్యప్రియుండు
ఘనభుజాశాలియగు పోతు గంటు మైలి.

సీ. ఢిల్లిలో సురధానుఁ డొల్లి వేదిధరాది [?]
దృఢుండు ప్రత్యక్షసాక్షిగాఁగ
మహనీయజయశాలి మలికనేమారుండు
జగదేకశూరులు సాక్షిగాఁగ
జగతిపై డెబ్బదేమగురు నాయంకులు
నక్షీణబలయుతుల్ సాక్షిగాఁగ
సహజసాహస యుద్ధసన్నద్ధవరభటా
శ్రయమైన దాకోలు సాక్షిగాఁగఁ

గీ. సూర్యవంశోదయ ఖ్యాతుఁడార్య తెలుఁగు
బిజ్జలనృపాలుఁ గెల్చెఁ దద్భీమబలుఁడు
వైరిగజభీముఁ డమితసత్యప్రియుండు
ఘనభుజాశాలియగు పోతుగంటు మైలి.

ఈయన కొడుకు.

సీ. మాయురే శ్రీశోరమల్లసంహారకాంక
చాఁగురే తెలుఁగుబిజ్జలవిభాళ
హాహా సముద్ధతాహవవైరిగజభీమ
మేలు మేలు కులపిశాలిగోత్ర
హోహోసత్కీర్తి సముచ్ఛ్రిత బ్రహాండ
హాహా ప్రశస్తపిండాడుగండ
[illegible] పాంబాదేశహన్నిబ్బవరగండ
బళి బేతిదంప భూపాలదళన

గీ. యనుచుఁ గొనియాడుచురనిన్ను నర్థిజనులు
మగధమాళవనేపాళమత్స్యసభల
భీమభూపాల సత్పాత్రపృథుచరిత్ర
విభవనాభాగమైల భూవిభునిసాగ!

ఉ. వల్లభ! భోగభాగ్యసురవల్లభ! చారువివేకశారదా
వల్లభ! నిత్యసత్యరఘువల్లభ! ధర్మవిచారద్రౌపదీ
వల్లభ! వాగ్విలాసఫణివల్లభ! కాంతి విహారశారదా
వల్లభ! చింతపల్లిపురవల్లభ! అబ్బనృపాలువల్లభా!

మ. కదిలెన్ ఖండియరాయవల్లభుఁడు వేఁ్కన్ దాడి యీ రాత్రిపై
యదె ఛత్రం బదె చామరం బదె హయం బన్నన్ భయభ్రాంతులై
కదనోర్వీధరచాపచక్రధృతిగాఖడ్గాది శస్త్రాస్త్రముల్
చదరన్ వైచిత దీయవైరులుగిరుల్ సంప్రాప్తులై రక్కఁటే!

ఆతనికొడుకు.

ఉ. భండన మాటపట్టు జయభామిని నెచ్చెలి చండవిద్విష
న్మండలి దేహ రక్తములు మానక పానకముల్ గ్రసించు ను
ద్దండత డాకినుల్ సఖులు తక్కినభూతము లర్థి లిమ్మహిన్
ఖండియరాయవల్లభుని గన్ననృపాలకరాసి పుత్త్రికిన్.

అతనియనుజుండు.

సీ. ప్రతిపక్షసుందరీ బంధురస్తనముల
పసుపుపయ్యెదలకుఁ బాయుతెరువు
రిపురాయభామినీవిపులధమ్మిల్లంబు
విరులనెత్తావికి వీడుకోలు
శాత్రవకామినీ చటులనేత్రంబుల
కలికికాటుకలకుఁ గానివావి

అరిరాయభామినీయూపజాధరసుధ
సొబఁగుఁ విశేషములకుఁ జుక్కాకెదుర
గీ. చేసె నాకార ధాత్రి నీచేకరాసి
వైరిగజభీమ వల్లభేశ్వరతనూజ
వనజహితతేజ ! కామినీజనమనోజ
బహుతరాటోప సింగభూపప్రతాప!

ఈసింగమనేఁడేరావు (చిత్తుపురాల) సింగమనాయనివానిమఁడె.

## జగరావు - తిప్పరాయఁడు.

సీ. యవనుల గెల్వఁడే యంపరాయలుమాడ
నెట్టైన కంబము మెట్టుబైట
పరిపంథియోధులఁ బరపఁడే వాఁడిమై
నుద్దండవృత్తి కోనూరియొద్ద
కాటయవేమ భూకాంతునై న్యంబెల్లఁ
గొట్టఁడే యలుగుండుగొలనిక్రేవ
చమువహామాత్యుని సాచిగాఁగొట్టఁడే
కొండవీడాపెద్దకొండగడిని
గీ. ప్రబలరణరంగజయభేరిభాంకృతుండు
రాయచేకోలుగండధరావిభుండు
రామ రఘురామ బలభద్రరామ నిభుఁడు
దీప్రబలుఁడై నగజరావు తిప్పఘనుఁడు.

## అన వేమారెడ్డి.

రెడ్డిరాజులలో నీతఁడు విఖ్యాతబలపరాక్రముఁడు. క్రీ 1370 ప్రాంతముల నున్నవాఁడు. రెడ్డిరాజ్యమునకు నద్దంకి రాజధానిగా నుండఁగా నీతఁడు క్రొత్తగాఁ గొండవీడుదుర్గమును గట్టించి తనకు రాజధానిగాఁ జేసికొ

ప్పాడు. "కొండవీడుం రాజధానీం సవిచిత్రా మకల్పయత్। దృష్ట్వా త్వష్టాఽపి నైచిత్ర్య మభూ ద్విస్మా స్స్వవిస్మయః"—ఈతఁడు డిల్లీకోటి కెలమరాజులతోఁ బోరాడి రాజ్యమును పెంపువెలయఁజేసినశౌర్యశాలి. ఈయన నవరాజధానీ ప్రశంసాత్మకమగు సమస్య:—

ఉ. వ్రేటుల కాలుతున్నలుగ వేయఁగ జాలినరాయరౌతులన్
బోటరులైన వీరభటపుంగవు లోయన వేమభూప! నీ
పోటును గట్టియుండఁగను విగ్రహ మెంతటివా రెదుర్పఁగా
ఘోటకహాటకప్రకటకుంజరఘాటికిఁ గొండవీటికిన్.

ఉ. కాటమరెడ్డివేమఁ డవఘాటమహోద్భుతచండఖడ్గుఁడై
కాటమ జేసికోట గొని గౌతమవాహిని దాఁటిపోయి యా
కోటల నన్నరాసుతుల కోమలులన్ దగఁ గొంచువచ్చెఁ బో
ఘోటకహాటకప్రకటకుంజరఘాటికిఁ గొండవీటికిన్.

ఉ. ఘోటకభోటహాట కురుకొంకణసింధుమరాటలాటక
ర్ణాటకళింగవంగ ప్రవిశాంగ విదేహకరూశదుర్గముల్
సాటిరె యన్న వేమవిభుఁ డేలినదుర్గమైన యా
ఘోటకహాటకప్రకటకుంజరఘాటికిఁ గొండవీటికిన్.

ఉ. ఎత్తినబీర మొప్పఁ గడు నేపున వేమయయన్న వేముడుం
దెత్తినవారి విన్నఁ బరువెత్తుతలంపులె యెత్తుఁగాని మా
మెత్తను చెప్పలెత్తగొడుగెత్తఁ బతాకము లెత్తఁగా మనం
బెత్తిన తత్తరంబు మెయి నెత్తినభీతి నరాతికోటికిన్.

శా. భద్రత్యాగగుణాయురాహవకళాప్రస్ఫూర్తిఁ గోదండసం
పద్రేఖాకృతి నన్నవేమనృపతిన్ భాషింతు నీభూమి నే
భద్రేభాంతకు భానుపుత్త్రు భరతున్ భాషాప్రియున్ భార్గవున్
భద్రున్ భాను భగీరథున్ భవసుతున్ భంగోద్భవున్ భావజున్.

క. విని చెప్పకున్న దోషం
బని చెప్పెదఁ గొంటెమందు; బడి యెట్టన్నన్
న్నినుఁ బొంది కీర్తికామిని
యనవేమన్నృపాల! చెసల కరిగెను జామ్మో.

సీ. వీరనారాయణవిభుఁడు గొల్లెనయొత్తె
నేనంక దాడిగా నేఁగువాఁడొ
రాజవేశ్యావిటరాజు తేజీనెక్కి
వాహ్యాళిగా నెందు వచ్చువాఁడొ
జగనొబ్బగండఁడు సరస బంటులఁ జేర్చి
నేకోటఁ జుట్టుకో నెన్నినాఁడొ
కలియుగబేతాళఘనుఁడు ఖడ్గముఁబూనె
సరళోకి నెవనికై తలఁచినాఁడొ

గీ. ఎఱుఁగరా పని వేగరు లెఱుఁగఁ జెప్ప
నీదుశాత్రవబలములు నిద్రలేక
తిపిరి జడిసిరి నీఖడ్గతీవ్రఘాటి
వతనుసమరూప! అనవేమనాఖ్యభూప!

సీ. పావకపరమేష్ఠి పవనపారావార
పాకశాసనులు నీపాటివారు
కందర్పకాశ్యపీ కమలాధిపతికర్ణ
కాలకంధరులు నీకరణివారు
యామినీశయయాతియాదోధిపతియక్ష
యమతనూభవులు నీయంతవారు
శేషుశాట్టుక? వైరితాలాంకతారాద్రి
తారకాంతకులు నీతరమువారు

గీ. శుద్ధి మతిదయాగాంభీర్యవృద్ధి నూప
శాంతికరుణా విభూతికాంతిభాగ్య
సార ధనధైర్య తేజో విశౌర్య స్థైర్య
భుజబలంబుల ననవేమభూపవర్య.

సీ. భరతభాషాబ్ధి గురుభేదభుజగాధ
భూశాస్త్రముల ప్రోల్పువాఁడు
మధుమారమిహిర మీనధరముగ్దరమూర?
భిన్నశాస్త్రముల పేర్మివాఁడు
శరశాక్ర శబ్దిక శుకశౌక
శేషశాస్త్రముల సెలవువాఁడు
కరికాలకిరికీల కురుకూలకెసకేస
కైటభారాతుల కరణివాఁడు

ఉ. ధారుణిరాణివాసి నని తా ననుచున్నది యన్న వేముతో
మారుత భూభృల్లాధిపుని మానఁగఁ గారణ మేమికల్గెనో
— — — నారికైయునయా
నారికి నారికైయునఁ బరనారులు నవ్వరె మజ్జగబులన్.

క. ఏపనికిఁ దగినమనుజుని
నాపని కనుపంగలేక యవనీశుఁడు దా
నోపనిమనుజునిఁ బంపిన
నాపని దాఁ జెఱచివట్టు లనవేమనృపా.

## పెదకోమటి వేమారెడ్డి.

ఈయనకు సర్వజ్ఞచక్రవర్తి యని బిరుదు. అమరుశతకవ్యాఖ్యాసాహిత్యచింతామణ్యాది కృతుల కీయన కర్త. శ్రీనాథకవిసార్వభౌముఁ డీయన యాస్థానమున విద్యాధికారి. క్రీ. శ. 1404 మొదలు 1420 వఱకు నీతఁడు రాజ్యపాలనము చేసినాఁడు.

రజతగిరి గద్దెపీఁట యినచంద్రులు పేటినివాళిసల్లెమున్
సురతరపుణ్యుఁడైన పెదకోమటివేమనకీర్తికాంతకున్.

సీ. ఆచెంప నుద్దండ? (అచ్చంవుపుద్దంప?) అన వేమపుణ్యమున
గ్రామంబు తోరణకట్టి చేసి
ధరణికోటనుగల్లు ధనధాన్యవస్తువు
లరికట్టుకొని చూఱలాడి చేసి
మునుకోనియభిమానముద్ద (?) భక్షింపంగ
సారెకుఁ జేతులు చాఁచి చేసి
ఆభ్యంగనము సేయు నన్నగారికి [నన్నవేముని] నాన్న
నూనెలో చెప్పులు నూటి చేసి

గీ. కణఁగి శత్రులు [విప్రులు] సేయునాఘూత్యమును
నోర్చియుంటివి నీసాటి యుర్విఁగలరె
[ఓర్చికీర్తులుగాంచితివుర్విలోన
నెన్నరాజులు సాటిరా రవ్వరైన]
సమదరిపువీర రాజవేశ్యా భుజంగ!
అతులబలభీమ! పెదకోమటన్నవేమ!

## కాటయవేమారెడ్డి.

ఈతఁడు కాళిదాసునాటకత్రయమునకు వ్యాఖ్యాత. కుమారగిరిచేఁ గొండవీటిరాజ్య మేలించినవాఁడు. "నప్తా కాటయశౌరేః పౌత్రో మాచస్య కాటనృపసూనుః। వీరాన్నపోతనృపతేర్జామాతా జయతి వేమభూపాలః":— ఈయనభార్య, కుమారగిరితోఁబుట్టువు. కుమారగిరి తనయునిసానికి "లకుమ" నీత నికి రాజమహేంద్ర ప్రాంతదేశమును పారితోషికముగా నొసఁగి యుక్కెఁ బంపినాఁడు. తనయేకపుత్త్రుఁడు మృతినొందఁగా నీతఁ డారాజ్యమును దన యల్లుఁడగు వీరభద్రారెడ్డి కరణముగా నొసఁగి యాతనికి బాసటయై యుక్కె

దజీవితశేషమును గడిపెను. కుమారునికి యనంతరము కొండవీటిరాజ్య మేలినపె దకోమటి వేమారెడ్డి కీయన విరోధి. పెదకోమటివేమునికిఁ జెల్లఁదగినరాజ మహేంద్రరాజ్యము నీతఁడు వహియించుట విరోధకారణము. శ్రీనాథుఁ డీతని మహాపురుష్యుఁడ' ని ప్రశంసించెను.

ఉ. మానుషదానమానబలమానితధర్మర మామనోజ్ఞ చే
ఖానుతభూతివిత్తములఁ గాటయవేమునఁ బోల్తు వాసవిన్
వానివిరోధి వానివిభు వానివిపక్షుని వానియగ్రజున్
వానిమఱంది వానిసుతు వ్వానియమిత్రుని వానిమిత్రునిన్.

ఉ. ఓలి నరాతులం దునిమె నుగ్రతఁ గాటయరెడ్డివేమభూ
పాలుఁడు రాక్షసత్రిపురభంగముచేసిన ధీమురీతి, నా
కాలపుఁ బార్థువైఖరి జగంబును జాల నుతించుచుండఁగా
నాలిపరాభవంబునకు నంబుధి గట్టినరాముకైవడిన్.

## అల్లయ వేమారెడ్డి.

శ్రీనాథుని కాశీఖండము కృతిగొన్నవీరభద్రారెడ్డి కీతఁ డన్న. భార్యా మూలమునఁ దమ్మునికి నిచ్చినరాజమహేంద్రరాజ్యము నీతఁడు నిర్వక్ర పరాక్రముఁడై పెంపొందించినాఁడు. క్రీ. శ. 1440 ప్రాంతమువరకు నీతఁడు కలఁడు. ఈతనిపయిఁ జెప్పఁబడినపద్యములు పెక్కులు శ్రీనాథకవికృతములవి:-

సీ. వివిధవిద్యోద్దండ విఖ్యాతుకూటమకాంత
హరిణాంక! రూపనారాయణాంక!
నీతోగ్రకరవాల నిర్జితారిస్తోమ
సత్రాంగ! రాజవేశ్యాభుజంగ!
సకలమహీరాజ్య సంరక్షణోద్యోగ్య
కులశీల! సజ్జనస్తవవిభాత
భాష్యాజనస్వాంత సరితోషణలభాంత
కోసండ! రాయచేకోలుగండ

క. జయవిజయ జన్యకాంభోజ హయసమాజ
ఖురవిపాటన సంభూతకు తలరేణు
పటలనిబిడఘనధ్వాంతకలితభువన
విజయరఘురామ! అల్లాడ విభునివేమ!

సీ. ఖండేందుమౌళిపైఁ గలహంసపాళిపైఁ
గర్పూరధూళిపైఁ గాలుద్రవ్వ
మిన్నేటితెఱలపై మించుతామరలపై
మహిమంచునుఱలపై పల్లరించు
జంభారిగజముపైఁ జంద్రికారజముపైఁ
జండీశధ్వజముపైఁ జౌకళించు
ముత్యాలసరులపై మొల్లఁక్రొవ్విరులపై
ముదికల్పతరులపై మోహరించు

గీ. వెండిమల యెక్కి శేషాహి వెన్నుఁదన్ని
తోడరి దుగ్ధాబ్ధితరఁగలతోడ సెలరి
సెలఁతనంబాడి నీకీర్తి నిండె సహాహా
విజయరఘురామ! అల్లాడవిభునివేమ!

సీ. దండయాత్రాఘోషతమ్మటధ్వానులచే
గంతులు వేయించెఁ గన్నకొండ
కితపకాలాభీలకీలానలముచేత
నేలపాం గదఁగించెఁ బాలకొండ
? ఆరట్టజాఘట్టహయఘట్టములచేత
మట్టితూర్పెత్తించెఁ బొట్టునూరు
ఘోరప్రతాపాగ్నిఁ బుటములు పెట్టించె
విద్వేషు లనఁ గశౌ వెండిపురము

ధరణీస్థలముఁ ద్రొక్కి గిరులెక్కి పరవార్థి
వరుసతో సంభోధివరులఁ జూచి
అనిలమార్గము దాఁటి యినమండలము మీఁటి
శశిమీఁటి నక్షత్రసమితిఁ గేటి
ఘనశింశుమారచక్రముఁ ద్రిప్పియత్రాతి
భవు మించి గోలోక శివ మహించి

— — —

గీ. పూర్ణవిధుగాత్ర నీయశోంబురుహనేత్ర
జగము లన్నియు దానయై సంచరించె
విమతలయరుద్ర! యల్లయవీరభద్ర!

సీ. భద్రమరుత్ప్రియాణగుణ పౌరుషదానవినీతిశౌర్యసం
పద్గరిమప్రశస్తిగుణవర్ణితుఁ డల్లయవీరభద్రుఁ డా
భద్రకభద్రభద్ర గజభద్రక భద్రకభద్రభద్రకో
ల్భద్రమ వీరభద్రబలభద్రసముద్రసురాద్రి భద్రులన్.

## శ్రీకృష్ణరాయలు.

ఈక్రిందిసమస్య లొల్లలక్ష్మీధరపండితునిచేఁ బూరింపఁబడెను. ఇతఁడు కృష్ణరాయనియాస్థానవిద్వత్కవి.

శ్లో. శ్రీకృష్ణక్షితిపాలరత్నమణిభిర్విద్వత్కవీనాం గృహే
నానారత్నవిచిత్రకుట్టిమభువో రత్నాకరత్వం గతాః
అబ్ధిః కేవల వారిపూరనిలయ స్సంభావ్యతే సజ్జనై
రంభోధి ర్జలధిః పయోధి రుదధి ర్వారాన్నిధి ర్వారిధిః.

ఇదే సమస్యకుఁ బ్రాచీనతరమగు వేఱొకపూరణము:—

శ్లో. అంబా కుప్యతి తాత! మూర్ధ్ని నిహితా గంగేయముత్సృజ్యతాం
విద్వన్ షణ్ముఖ కా గతి ర్మయి చిరం తస్యా స్థితాయా వద ।

ఘోటీధణంధణాఘోర నాదములచే
 వినుకొండ దుర్గంబు విరిగిపడియె
వాహినీసవుతాంబు (?) వాహాముఖంబుగా
 లక్కవరమ్ము కరగ బెల్లంబుకొండ
క్రూరరాహుత్తఖడ్గకులిశధారలచేతఁ
 గొలసి చెల్లుబడగట్టెఁ గొండవీడు
గీ. కూలె బెజవాడ కంపించెఁ గొండపల్లి
 పగిలెఁ గటకంబు గగ్గోలుపడియె ఢిల్లి
 ఏకధాటిగ నీవు దండెత్తినపుడు
 కీర్తితోపాయ ఘోటేయ! కృష్ణరాయ!

పూసపాటి వారు.

ఉ. ఆయతకీర్తి సజ్జనకులాగ్రణి మాధవవర్మ చింతలం
 గాయలు కోసి యమ్మకొను కత్తెలగుండదనూజునాపుకై
 శ్రీయుతుఁడైన పుత్త్రు తలచేతికినిచ్చె బెజవాడపోలె నా[?]
 పాయక నిల్చె వార్ధిశశిబాణశకాబ్దములైన కాలమున్.
ఉ. కత్తెలగుండడు... కత్తెదురక్ దసనఁట్టిఁ బన్ని యా
 పుత్త్రునఁ జంపఁ జిత్రమని భర్గుఁడు మెచ్చి సువర్ణవృష్టియు
 పృట్టిణభూమిలోఁ గురియఁ బంచెను మాధవవర్మ పాడి పెం
 పెట్టిదో యంచు నింద్రుసభఁ జేర్కొని రెన్నడు దేవసంఘముల్.
సీ. చినుకుకుఁజినుకు కెత్తు కనకంపువర్షంబు
 నేరాజు కురిపించె నేడు గడెలు
 దురితవిదూరుఁడై దుర్గజగన్నాథు
 మెప్పించె నేరాజు మేదినందు
 గరువంబునకు బోయవరుఁ బన్ని శిశు...
 తనశిశుఁ జంపెను......

చతురంగబలములు శక్తితో సంధించి
పగతుఱ నేరాజు పఱపినాఁడు

గీ. ఘానుసంఖ్యుండు సహకారబాంధవుండు
సన్మహాయుండు తను... తాతతండ్రి
సాసఁగ నెన్నఁగా నీసాటి పూసపాటి
రాజకులదీప ! ఉద్దండరాచమాన !

చ. ఎనిమిదివేలదోరగలయేనుఁగులున్ వడి నేలద్రొక్కి త్రొ
క్కనిదశలక్షవాజులను గేలుఁడు పోని
ఎనయఁగ దుర్గ యిచ్చె ధన మిద్ధధనంజయభీకరాంకుశున్
మనుజవరేణ్యుతం బరగుమాధవవర్మకు గౌరవంబునన్.

సీ. మస్తఖండాపూని మ్రాకులు తెగనొత్తి
మెఱయుమన్నీలకు మిండగీఁడు
పూని గంతులువేసి బోరుననార్చియు
మురియుమన్నీలకు మూఁకవిప్పు.
కోపించి నడివీథి గుఱ్ఱంబుదట్టించి
వదరుమన్నీలకు వలపువిటుఁడు
వనితలముందఱ వన్నెలుపెట్టుక
నిక్కుమన్నీలకు నెత్తిపిగుడు

గీ. అనుచు నర్థులు దిక్కుల నభినుతింప
వీరవిక్రమవిఖ్యాతి వెలసి తౌర
మన్నెసుల్తాన శాత్రవమానభంగ
వినుతనారాచ! చినతిమ్మ విభునిరాచ.

సీ. మనసు లోఁగని వైరిమన్నెపేరంటాండ్రఁ
గదినాన గర్భాలు కలఁగమోదుఁ

గంటగించెదు మన్నెకొంటె భూపతులాంధ్ర
నెస నర్థికోటికి నెచ్చపెట్టు
లక్ష్మాభిమానంబు లజ్జగించెదుమన్నె
కూటులం జెలచుంచు కోసి నేయుఁ
దొడరిన రిపుమన్నె గుక్కి పెద్దులఁ గాంచి
కరకరినదలించి కసవు మేపుఁ

గీ. జెమగుగుల్లాపుమన్నెలఁ జెండియాడు
విభవగుల్లాపుమన్నెల వెన్నుఁజఱచు
భూమతాటోప గుణపేటి ప్రాసపాటి
రాచవిభుతమ్మ! ఉద్దండరాచమాన!

క. కరకరి తమ్మయరాచం
దటిముటి తురగంబు నెక్కి గూడఁ గ్రొవ్వాలిజా
బిఱవల్లె విడిచినంత ని
మొఱవెల్లు నరాతిరాజ ముఖ్యపృథ్వీశా.

క. మన్నెసుల తానుబిగాదం
బెన్నఁగ గజరాజాళిటు నెన్నఁగఁగలపృథ్వీశా
మన్నెలమనుచు వచ్చినఁ
దన్నును నీగాడుగు వాఁడు తమ్మయరాచా.

సీ. హేమాచలముదాఁక నేకఛత్రంబుగా
భువియేలె మీతాత బుద్ధవర్మ
మీతాత పరియించె మొఱసి నాగానవర్మ
గరిమతో బెజవాడ గనకవ్రాస్తి
పాండ్యకేకయచోళ సరవిగబంధములఁ
జెగటార్చె మీతాత దేవవర్మ

పిడుగుడు త్రియముగా నడి నేసె మీతాత
భీకరంబుగఁ జికభీమనృపతి

సీ. చండవిక్రమ! ఘనవంశజలధిచంద్ర
బాపు! నగధీర రణరంగ భైరవాంక
పోసగ నెవ్వారు నీసాటిపూసపాటి
రాచవిభుతమ్మ! ఉద్దండరాచమాన!

మ. అతిశౌర్యంబగు పూసపాటికులరాజాధీశు తమ్మయ్యకున్
సృతిగావించుచు నాశ్రయింతు రిల వర్నాటీ నరచ్ఛేదికా
కిరకోటప్రభులాత్మబాంధనతనో గెల్వంగలేకో మహా
చతురంబంచునో ఖద్విపాగ్నిశశభృచ్ఛాకాబ్దకాలంబులన్.

ఉ. కొండలురాజు లప్పనము గొమ్మనియియ్యఁగ బంధునర్గమై
కొంపలు గొల్వఁజేస్పుడివి కొండలు ద్రొక్కఁగ నూడిగంబులన్
ముంచటఁ గొంపలుంబినదు ద్రోపఁగ రాజుల పూజలింగమై
యొందుగుస నింపె రాచమనాగ్రహపుత్రసమ్మన రాజమాత్రుఁడే.

వత్సవాయవారు.

ఉ. ఆరసి వత్సవాయతెలుగాధిపనందన నారసింహ! మీ
త్యాగము గర్వితాహితవిదారము సత్కవిబంధురక్షణో
దారము సత్యశౌచనయధర్మవిచారము కామలోకవి
స్తారనివారణమున్ సదాచారము దైన్యనివార మారఁగన్.

క. రాచర్కు మనఁగఁ జెదప్పఁ
బోఁచా మతి రిపులగలిచి భూసుతకీర్తిన్
రాచకుల కీర్త్యఁగనుగు నై
రాచర్కము వత్సవాయరామనృపాలా!

మ. ఇతఁడా గంగపభంగసంగచమూహేలాత్మచ్ఛటాపావక
ద్ధతకీలాంశలభాయమానరిపుబాహ్వాద్రాగ్రశుద్ధారానదీ

సతరంగిణ్యాబలాసమాగమసమానంపత్పదమోఘస్తుత్యా
యతశౌర్యోజ్జ్వలుఁడై నవత్సనయరాయామాత్యవరుం జీతఁగా!

మ. మహి నానంచన్నపాలు శ్రీవిజయరామస్వామిని నా లోకినూ
ర్జిహలు సేక్ ఖానునిమ స్తకం బున కొలుచ కం హయ్యోరం హయ్యోన
వ్యాహారిస్ఫోటకమండపం బస్సు రంభాకంచుక గ్రంథి నరుణా
రహి రెండయ్యో జనాసులాపమునకున్ చెప్పెదిద్రేఁకనాఁటినట్

ఉ. తేఁకువతోడ నత్సదియపిమ్మ జగత్పతి ప్రాపు సేరగా
రాకు పరిభ్రమా యిఁకఁ బరాపునసైన గిరాటశైస నీ
పోకలు సాగ వింకఁ జెడిపోవక మాపగవారిఁ జేరువా
దీకొనివచ్చి తేని నినుఁ దిట్టక కొట్టక మాన నిమ్మహిన్.

క. డాబాలోఁ గూర్చున్నాఁ
డేబాలుఁడు ముద్దుగుమ్మ యెవ్వరె చెపుమా
చాబాసు నీ వదెఱుఁగవె
బాబాజీ బుచ్చితిమ్మబహాదరె చెలియా!

ఈకొండమనేఁడే రావుసింగమనేనియన్నగు నేనిబాల.

సీ. చటులశాత్రవకోటిఁ జక్కాగా సఱికవే
పిలిచి బిడ్డలపేర్లు పెట్టుకున్న
మత్తారిసంఘంబు మట్టిమల్లాడవే
పరతెంచిపదములఁ బడకయున్న
చెనఁటివిరోధులఁ జెంచిచెండాడవే
యెలమితోఁ గానుక లియ్యకున్న
గబ్బివైరులఁబట్టి కసవుదిన్పింపవే
వేవేగ శరణంబుఁ వేఁడకున్న

గీ. గండభేరుండగండరగండబిరుద
గురుతరోద్దండపులియమారోక్కలుగండ

శుభకరాకారకొండభూవిభుకొమార
దీపితాటోప! జూపలితిమ్మ భూప!

సీ. రభసంబుతో వైరిరాజన్యపక్షులఁ
గొట్టుకొక్కులఁ జూపచుట్టుగాను
చటులారివరవీరచక్రవాకంబులఁ
జించు గోళ్ళను బటాపంచగాను
కపటశాత్రవ విహంగమకోటి శిరసులు
చెండు ముక్కున గింతతుండెపులుగ
ఘోరవిద్వేషిశకుంతమాంసంబులు
భక్షించు వేడ్కతోఁ గుక్షినిండ

గీ. అవుర నీగండభేరుండ మహరహంబు
తివిరి యీరీతివిహరించు దిక్కులందు
శుభకరాకార కొండభూవిభుకుమార
దీపితాటోప! జూపల్లి తిమ్మభూప!

సీ. బిరుసైన నీగండభేరుండ బిరుదంబు
తమదన్నవాఁడు నీతమ్ముదిండి
పెంపైన నీగండభేరుండబిరుదంబు
పెట్టెడువాఁడు నీబెత్తవాఁడు
తీరైన నీగండభేరుండబిరుదంబు
గుటిఁబూనువాఁడు నీగోడుగువాఁడు
పేరైననీగండ భేరుండబిరుదంబు
కోరెడువాఁడు నీకుంచెవాఁడు

గీ. మండలంబున గండభేరుండ బిరుదు
నీకె తగుఁగాక దూబమన్నీల కేల

భవ్యచారిత్ర ! కొండభూపాలపుత్త్ర!
దీపితాత్మశ్లోక ! జూపల్లి తిమ్మభూప!

ఉ. మండితకీర్తి మీఱఁగ జయమాఘచతుర్థిని నాఁడు గండభే
రుండముఁ దీసి క్రిందుపడి రూఢిని వెల్లకిరాయఁ బద్దిరా
కొండయతిమ్మనీకె శరణుగోరెను జూపలివంశచంద్రమ ని
న్నుండఁ బొందుఁ గొండపలిమాన్యులు సాక్షిగఁ గృష్ణసాక్షిగన్

క. గండర భేరుండబిరుదు
కొండయతిమ్మక్షితీశునకు భూషణమై
యుండెడి నల కనకశైలము
కొండుక పరిపంధిచాపగుడిసెలఁ గలదే.

క. కొలువక యిచ్చుట త్యాగము
కొలిపించుట యిచ్చు టెల్లఁ గూలిప నింతే
కొలువులకుఁ బసర మీఁదా
పొలుపుగ జూపల్లి కొండభూపతితిమ్మా!

క. కొండపలిబయల బిరుదులు
పండిన వేడుకలఁ బట్టి నీ కెదిరించే
బండీలఁ బట్టి ముక్కులు
చెండుదు వహ్వాటఁ గొండజనవరుతిమ్మా.

సీ. కొండంతభుజశక్తిఁ గొండలు సాధించి
సుపరీల గడికోట లాక్రమించి
పాడుపల్లెలు మేటిపట్టణంబులు చేసి
ఘనతటాకము లనేకములు నిల్పి
బహుశాసనంబులు పెట్టి బావులు త్రవ్వించి
బాపలపెండిండ్లు పరగఁజేసి

దండసమానసాహస నిరతంబును నిన్నును బ్రస్తుతింతురా
కొండపలరాయ వైరినృపకుంజర జూపలిశాసనోత్తమా!

ఉ. మండుపసందువాఁడవిళ్ళమాలవమత్స్యవిదేహకాశభూ
మండలరాజమధ్యమున మచ్చిక నెంతురు నిన్ను గండభే
రుండపదప్రచండుఁడని రూఢిగ నర్థులు జూప్లికాండపమా
కొండపలరాయ నిజ సుకవికోవిదరాయనిఁ బ్రస్తుతించెదన్

జూపల్లి వారు.

సీ. కలితధర్మజ్ఞానఖని ధర్మజుఁడు గాని
పరభయంకరభుజాబలము లేదు
పరభయంకరభుజాబలుఁడు భీముఁడుగాని
వివిధాస్త్రశస్త్రకోవిదత లేదు
వివిధాస్త్రశస్త్రకోవిదుఁ డర్జునుఁడుగాని
సతతదానకళాభిరతియు లేదు
సతతదానకళాభిగతుఁడు కర్ణుఁడుగాని
వరవంశసంగతత్వంబు లేదు

గీ. అనుచు ధర్మజభీమార్జునార్కసుతులఁ
బరిహసింతువు ఘనధర్మబాహుసత్వ
శస్త్రపటిమ వితీర్ణిభాస్వత్కులముల
గురుతరాటోప! జూపల్లి గోపభూప!

సీ. శ్రీకీర్తి రస్తు సంచితగండభేరుండ
బ్రహ్మాయు కరవాలభైరవుండ
అభివృద్ధి రస్తు రాహుత్తమువ్వరగండ
శుభమస్తు రాదివి [విళ?] చూఱకార
కుళలంబు దుష్టగోకులమానమర్దన
కటకహాన్నిబ్బరగండబిరుద

శత్రుక్షయోస్తు చేశ్వభక్తిహారిణ
భద్రంబు నీకు విష్వగ్లగోత్ర
గీ. అయు రారోగ్య ముత్తమనాయకేంద్ర
అపుర సంకల్పసిద్ధి నీ కనుదినంబు
వైభవాకార! అప్పయ్యనాకుమార
రాజదేవేంద్ర! జూపల్లి గ్రామచంద్ర!

### సాయపనేని వారు.

సీ. అదిగొ సాయపనేనియాపట్టుఘోట్టాణ
ఘాటికాఘోటి కాదళితరజము
ఇదిగొ సయ్యన ధీరహేలాఘమామికా
ఘాంఘణఘాంఘణధ్వనితరవము
అదె వచ్చెఁ జినవేంకటాద్రినాయకసింహ
బలుఁడు బాహాబలప్రౌఢిశాలి
ఇదె లగ్గపట్టించె నెట్టన పలికొండ
ఘనదుర్గభటజనుల్ కదుపడంకఁ
గీ. గినిసి మన్నీలు చూడంగ మొనసి శౌని
గరిమ నడపించి పలికొండఁ గట్టితౌర
నవనవాంబధి నిశ్శంక సార్వభౌమ
ధీరసేనేంద్ర! వేంకటాద్రిక్షితీంద్ర!

### పెమ్మసాని వారు.

సీ. జాటవారి ముందర శూరత్వ మేర్పడ
రణభూమిలో సల్కరాజు గెల్చి
కోరి శేతముచెర్ల కోట ధూళిగఁజేసి
చింతగుంట్ల రఘుపతిపంత మణఁచి

రక్షించు గరుడనారాయణాంకవిహార
మనుపుము శాస్త్రవినయదవిఘాల
విగ్రహింపకపును హవ్విబ్బరగండ చే
పట్టు గండరసూర్యభద్రచిహ్న
గీ. అనుచు నీచేతి హేతికి నడరి రిపులు
శరణుఁ బొందిరి భవదీయచరములకు
ధీర పెమసాని యక్కభూపార్థివకుమార
భోగదేవేంద్ర! చినతిమ్మ భూపచంద్ర!
సీ. వేలసంఖ్యలుగాదా వినుతింప నీయాజి
స్థిరసత్యసల్లాప తిమ్మభూప
తనపాపరశ్రీలమీఁదనె కదా నీఘాటి
ధీరతరాటోప తిమ్మభూప!
మన్నెరాజుల కదా నిన్నుఁగొల్చినవారు
దేవేంద్రసమరూప తిమ్మభూప
రాయదేవుఁడె కదా రహిమించు నీకొల్వు
కమ్మనంశసుదీప తిమ్మభూప!
గీ. ఎంతమన్నెఁడ వౌరౌర యెంచిచూడ
గండరాదిత్య ముఖ్య ప్రచండబిరుద
భీకరాహవసేనాని! పెమ్మసాని
యక్కభూపాల చినతిమ్మ యాలఘుధర్మ.
సీ. సమున మీపెదతండ్రి రామలింగవిభుండు
ముగురురాజుల్లను మెక్కపటిచె
మీతండ్రి పెదతిమ్మ భూతలాధ్యక్షుండు
దస్తూరిఖానుని మస్తణంచె

మీయన్న బళి చిన్ననాయకేంద్రుఁడు మస్త
ఖానుని బలము చీకాకుపఱిచె
అది విచారించి నీవశ్వరాయని బల
మడఁచవే జమ్మలమడుఁగు బయల

గీ. ఆహాహా నీగెల్పు నెన్నంగ నవనిలోనఁ
దరమె శేషునికైన ముష్కరతురుష్క
మస్తకన్యస్త చరణ సమస్త శస్త్ర
నవబిరుదసింహ పెమసాని నారసింహ.

తిమ్మయ బుక్కరాజు.

సీ. పరవీరనరపాలశిరములు పొక్కిళ్లు
భద్రేభకుంభముల్ భాండసమితి
లలితప్రతాపానలం బగ్నికీలలు
కపటారిశల్యముల్ కాష్ఠసమితి
కడికండలై యుండు తురగాళిఖడ్గాలు
నిబిడారిసతుల కన్నీరుజలము
కుటిలారిమాంసంబు కూళ్లనుగూరలు
ప్రత్యర్థిరక్తంబు పానకంబు

గీ. ఇన్నియును గూర్చి సమరోర్వి నిష్టమహిమ
నామెతలు పెట్టి భూతాళి కర్పితముగఁ
బ్రేమదళుకొత్త జయకాంత పెండ్లిగోరు
భోగసురరాజ తిమ్మయబుక్కరాజు.

శాకమూరివారు.

సీ. శ్రీమించుమన్నియ శేఖరాధిపవర్య
శౌర్యగాంగేయ సౌందర్యమదన

సమదారిగజసింహ సర్వజ్ఞత్రిపురారి
పరశత్రుభేదన పరశురామ
సత్యహరిశ్చంద్ర నిత్యవైభవసాంద్ర
మానదుర్యోధన దానకర్ణ
పాకారిసమభోగ భానుసన్నిభతేజ
అద్రిధైర్య ... మాసక్షేత్రమూర్తి
గీ. నిన్నువర్ణింపఁగవులకు నేర్పు గలదె
శాకమూరన్వయాంభోధిశరద్వరీశ
ఘాటిరఘునాయక ప్రభు పేటితనయ
వైరిజిద్రంహ! వేంకటనారసింహ.
సీ. దర్పితాహితరాజ దర్వీకరాళికిఁ
బరగఁబక్షిరథాధిపక్షి యయ్యె
ప్రత్యర్థినరపాల భద్రేభసమితికి
సంహారవిక్రమసింహ మయ్యె
ధీరవైరిసమార త్రిపురసంఘమునకు
రౌద్రవీరావేశ రుద్రుఁ డయ్యె
కుటిలారిపృథ్వీశకుల మేఘపటలికిఁ
బ్రళయకాలాభిలపవనుఁ డయ్యె
గీ. నీప్రతాపంబు వర్ణింప నెవరితరము
శాకమూరన్వయాంభోధి చంద్రబింబ
ఘాటిరఘునాయకప్రభు పేటితనయ
వైరిజిద్రంహ! వేంకటనారసింహ.
సీ. ప్రత్యర్థిమత్తేభపంక్తికి మృగరాజు
పరసర్పవితతికిఁ బక్షిరాజు
శాత్రవతిమిరసంచయమునకు దినరాజు
అహితగోత్రాళికి నసురరాజు

దర్పితాహితపద్మదళముల కుడురాజు
నభియాతిఘనులకు ననిలరాజు
పరిపంథిమారుతప్రతతికి నహిరాజు
నరివనంబులకు దావాగ్నిరాజు
గీ. అనుచు విబుధులు నీఖ్యాతి నడరి బెదరి
యణఁగియుందురు శాకమూరన్వయేశ
గురుగుణోదార రఘునాయకులకుమార
వైరిజిత్ప్రసంహా! వేంకటనారసింహా.

మేడవర మెట్లవారు.

సీ. కాల్బలంబులమీఁద ఖడ్గంబు వైవఁడు
రాయరాహుత్తుల వేయుఁగాని
రూక్షి కెక్కినహయారూఢుల డాయఁడు
వీరసాహసులను డాయుఁగాని
వెన్నిచ్చిపఱచుభూవిభులవెంటాడించఁ
డెదిరించురిపులపై నెక్కుఁగాని
సామాన్యయోధుల సరకుసేయం డాజి
మించునెక్కుడుకాండ్ర డించుఁగాని
గీ. వెఱచి పఱచినఁ గసువులు కఱచి మఱచి
గట్టులెక్కిన నరచినఁ గాచు రిపుల
బళిర మేడవర మెట్లయాబళసుతుండు
మన్నెమాత్రుండె నరసనక్షాత్రవిభుండు.
సీ. బాహాబలాటోపపటుగర్వములు మించు
కూటువమన్నె లగుండెదిగుల
ఆహవక్షోణిలో నరిసేనఁ బొడగని
పారెడు మన్నెభూపతులవిటుండు

పలుకుపంతము లోక్కుభంగిగా మెలఁగక
యుచ్చరెడికోదమనాయఁకులమగఁడు
సాదవనిపోఁయను నిడనిత్యాగంబునై
యిలనొప్పుమన్నీల యింటిభర్త
గీ. అతఁడు పువునూరిభువనవిఖ్యాతయశుఁడు
అతఁడు గజపతిరాజసాహాయ్యకర్త
అతఁడు సుల్తానగర్వనిర్వాపహర్త
నారసింహుండు • మేదరినరసవిభుఁడు.
సీ. గజపతిమన్నెఁడుకమలాక్షి! యితఁడచేఁ
సఖి రాజవేశ్యాభుజంగుఁ డితఁడె
కోమలి! కోటలగొంగ యీతండచేఁ
కాంత! రాచూరిదుర్గాపహరుఁడె
నాం! యీతఁడు పువునూరిసింహం బచే
అలివేణి! కోదమనాయకుఁ డితండె
చెలియరో! సురమాయిచిహ్న మీతండచేఁ
అతివ! గగ్గోలురాయాంకుఁ డితఁడె
గీ. అనుచుఁ బౌరాంగనలు మహాహర్ష మొదవ
నొండొరుల పోచ్చరింపుచు నుందురహహ
బళిర మేదరమెట్లఅయ్యలకుమార
మన్నెదేవేంద్ర! నరసింహమండలేంద్ర!
క. కంటకపురిపులఁ బొడఁగని
గెంటుచు వెన్నిచ్చి పోక కనిసినయపుడే
బంటైనవానికెల్లను
కంటై నిలిచేది వరుసకగరయ నరసా!

సీ. మాటాడితప్పనిమన్నీల నేవేఁడ
భట్టునెన్నని లోభిపంచఁ బొగడ
పెన్నిచ్చుమన్నీని వినుతిసేయఁగ నొల్ల
కొలువెఱుంగనిమన్నెఁ గొలువ నొల్ల
ప్రజ్ఞమీఱనిమన్నె బజగొల్లఁ బ్రణుతింప
నీతిచాలనిమన్నెనీచు నొల్ల
పరువెఱుంగని మన్నెవానిఁ గన్నులఁ జూడ
మహిని దుర్మన్నెయమాటు నెంచ
గీ. నిన్ను నీవంటిమన్నీల నెంతుఁగాని
ఆహవోద్దండ కొదమనాయఁకులగండ
వనధిగంభీర! అయ్యలవరకుమార
మేటిరణధీర! ... మేదరమెట్లనరస!
ఉ. బట్టును నేను కమ్మకులపట్టపురాజవు నీవు కావ్యవా
గ్ధట్టుఁడ నేను, శౌర్యనయధర్మవిదగ్ధుఁడ వీవు, నేల యీ
పట్టునఁ దొంటియట్టు నయపద్ధతిఁ బ్రోచికృపానిరూపముల్
మెట్టగదయ్య యయ్య! ఘనమేదరమెట్లనృసింహభూవరా!
సీ. విజయంబుగజపతినిజమన్నెధౌరేయ!
ఆహవోద్దామ కేశాదిరాయ!
పేరైనసురమాయిబిరుదాంకమూర్ధన్య!
ప్రతిపక్షసంహార పరశురామ!
హంవీరపువునూరిసింహాసనధురీణ!
గగ్గోలురాయ సంగ్రామభీమ!
ప్రకటకోటలగొంగ ప్రత్యర్థిమదభంగ!
జగదీశరాజవేశ్యాభుజంగ!

గీ. అనుచు సుకవులు ని న్నెంతు రన్నిదిశల
మిహిరసమతేజ మేదరమెట్లభోజ!
నారసింహార్యసత్పుత్ర! నవ్యగాత్ర!
గీతగుణసాంద్ర! రమణపృథ్వీతలేంద్ర!

సీ. దురములో రాచూరుదుర్గాపహారణాఖ్య
బిరుద మేమన్నె భూవరుఁడు చెందె
రణములో నేమన్నె రాజన్యుఁ డింపొందఁ
గొదమవాయరికిరవిదితుఁడయ్యె
బవరాన నేమన్నె భార్గవుం డెక్కుడై
గగ్గోలురాయాంకఘనతఁ దనరె
కదనాన నేమన్నె కంఠీరవుఁడు హెచ్చి
కోటలగొంగాఖ్యగురుతుమీఱె

గీ. నిన్నిబిరుదులు నీయందె యెన్నఁగలిగె
మిహిరనిభతేజ మేదగమెట్లభోజ
నారసింహాంక సత్పుత్త్రి నవ్యగాత్ర
పూతగుణసాంద్ర! రమణ పృథ్వీతలేంద్ర

సీ. సిరిమించుసురుమాయిబిరుదుమన్నెకుమార
భీమప్రతాప సంగ్రామవిజయ
గజపతిసామ్రాజ్యగజమన్నెసింహామ
శైలాదిరాయ గాంగేయశౌర్య
కమ్మకులాధ్యక్ష ఘనకీర్తివిస్తార
తమ్మలూరిసుగోత్ర దానకర్ణ!
సత్యహరిశ్చంద్ర నిత్యాన్నవరదాన
భటకవిసంస్తుత్య బంధుమిత్ర

గీ. మిత్రజనపోష మేచయ మెట్లువంశ
జలధిసారంగ! లోభివేశ్యాభుజంగ!
మల్లభూపాలసత్పుత్ర మంజుగాత్ర!
భవ్యగుణగణ్య! కొండపప్రభువరేణ్య!

మాణిక్యరావువారు.

సీ. సుమమార్తికాకల్ప సుప్రతీకంబుతో
కంబుతోఁ బుండరీకంబుతోడ
నల్లనకుసుమ సంపాదనై కాంతుతోఁ
గంతుతో రోహిణీకాంతుతోడ
అధిగగతపరమోగ్రుఁడైన స్వర్భానుతో
భానుతో నలచిత్రభానుతోడ
చండిగాండీవ కోదండాభిరాముతో
రాముతో నందనారాముతోడ
గీ. నీయశస్స్ఫూర్తి నీమూర్తి నీప్రతాప
దీప్తి నీదోర్బల స్ఫూర్తి దీటుమిగిలి
యలరె మాణిక్యరాయవంశాబ్ధిసోమ
భాసురగుణాళి భావభూపాలమౌళి.

సీ. ఒకతూత కుతుకంబుతో ప్రకటవతీక్ష్ణభుజా
దండుఁడై కోవెలకొండ యేలె
నెలమి రెండవతూత యిభరాముపాదుశా
పంపునఁ బెదకొండపల్లె యేలె
మహిమించు ముమ్మడిమాణిక్యరాయఁడు
వినుతి కెక్కినకొండవీటి నేల
రాణించురఘుపతి మాణిక్యరాయండు
పరభయంకరవృత్తిఁ బరిఘవిల్లె

వర్ణితస్వాంత! రేపల్లెపూర్ణికాంత
దీపితాటోప! వేంకటగోపభూప!

అట్లూరి వేంగళన్న.

సీ. పరగ ధర్మాధర్మపద్ధతుల్ దిగనాడు
దుండగీఁడగుకమ్మ గుండ్లకమ్మ
అగణితవిఖ్యాతి నెగడ నేర్చినయట్టి
మన సెఱుంగనికమ్మ మాచకమ్మ
కడఁగి వైరులమద మడఁచిపుచ్చఁగలేక
యడఁగియుండెడుకమ్మ యాపఁగమ్మ

గీ. కమ్మలందఱుఁ గమ్మలా! కమ్మ లరయఁ
గమ్మలకుఁ గీర్తిఁ దెచ్చినకమ్మ వీవె
ప్రథితగుణహార! నారమాంబాకుమార
విక్రమోపేంద్ర! అట్లూరివేంగళేంద్ర!

జల్లి అంకభూపతి.

ఉ. జల్లికులావతంస బలశాసనవైభవ యంకభూప నీ
పల్లవితైకకీర్తిరుచిజాలము మిక్కిలి వన్నెవెట్టు జా
బిల్లికిఁ బాలవెల్లికిని భీష్మునితల్లికి నాణిముత్తెపుం
జిల్లికిఁ గల్పవల్లికిని సాగరగర్భవధూమతల్లికిన్

కాళభూపతి.

ఉ. ఏమిదరిద్రమా! సుకవి యేమిర? పొమ్మిఁకఁ; బోక యుండినన్
నీమొన లేమిచేయుదు; నది నీవె యెఱుంగుదు వైనఁ జూడుమా
ప్రేమజకాళభూపతి కృపాంబుధిచే విలసిల్లుదానము
క్షామితహేమధారయనుఖడ్గముచే నణఁకింతు ధీరతన్.

జగ్గరాజు.

ఉ. కొంచులవెంబడిన్ మునుపు కొన్ని దినంబులు సంచరించి సీ
ఘ్రంచును వారి రోసి మహదాశ్రయ మంచును మిమ్ముఁ జేరితిన్
సంచకులై సదుప్రభుల వాకిటికిన్ మగుడన్ జనంగ నా
కించుక బుద్ధి పుట్ట దిఁక నేమియుపాయము జగ్గరాణ్మణీ!

వేళ్ల — వేంకటకృష్ణరాజు.

మ. చెలఁగెన్ వేజెళసార్వభౌముఁడు జయశ్రీశాలి సింహాసన
స్థులలో నేడవరాజు దిగ్విజయకీర్తుల్ వానివే వానితోఁ
గలహం బెప్పుడు వద్దురా రిపునృపుల్ గర్వించి మార్కొంటిరా
పులితో లేళ్లు విహంగపుంగవునితోఁ బూరేళ్లు పోరాడుటల్.

నూజివీటి — యప్పారావు.

చ. వెలమకులంబునందు నిలువెళ్లరు కాంత లటంచుఁ బల్కున
ప్పలుకు లబద్ధమయ్యెఁ గులపావనుఁ డీఘనుఁ డప్పరాయరా
డ్కులభము కీర్తికాంత కృతికాంత మహీజయకాంత యిప్పుడీ
కలిజగమంతటన్ దిరుగఁగాఁ గనుఁగొంటిమి చిత్ర మారయన్

వాసిరెడ్డి — వేంకటాద్రినాయఁడు.

సీ. లోకప్రతిష్ఠితోల్లుట్లనామకగోత్ర
పద్మపంకేరుహ బాంధవుండు
వాసిరెడ్డ్యాఖ్యాన్వవాయపారావార
శారదరాకా నిశాకరుండు
రణరంగఫల్గున రాజజగన్నాథ
భూజానిసింహ తనూజవిభుఁడు
లక్ష్మ్మసతీతుల్య లక్ష్మ్మసతీగర్భ
శుక్తికాసద్ఘోర మౌక్తికంబు

గీ. కొండవీడాది వినుకొండ కొండపల్లి
బందరు నిజాముపట్టణ ప్రముఖరాజ్య
విభుఁడు జగదేకవీరుఁడు వేంకటాద్రి
నాయఁడు బహద్దరు ధరాధినాయకుండు.

సీ. శశిలోనిమృగము పచ్చలభిత్తికాంతులు
దూర్వాంకురము లని దుముకఁ జూచు
మలచినకెంపుపట్టెలఁ జూచి మదనుండు
తనమానికపుదోన తలఁచు వెదకుఁ
బవడంపుఁ జూరు కల్పకశాఖి చిగు రని
కామధేనువు మేయఁగా యతించు
వజ్రనీల స్తంభవర్ణముల్ శివవిష్ణు
తనువులంచు నగాబ్ధితనయ లెంచు

గీ. సార నవరత్నబద్ధానుకారి ముకుర
నికరరుచి వేంకటాద్రీంద్ర నిరుపమాన
లలితకలిత సౌభాగ్యవిలాసనామ
సౌధవైభవ మగణితసరణి నొప్పు.

సీ. ఏవంకఁ జూచిన హేమరౌప్యాంచిత
స్తంభంబులకడింది తళుకులెసఁగు
ఎచ్చోటఁ జూచిన హెచ్చైనసమ్మదు హేమ
పటచిత్రశయనోప బర్హణములు
ఏచెంతఁ గనుఁగొన్న నెంచి చెప్పఁగరాని
నిలువుటద్దపు నిగన్నిగలు గ్రమ్ము
ఏకడఁ గనుఁగొన్న నెంతో వింతఘటించు
చిత్రవస్తుసమృద్ధి చెలువుఁ జూపు

గీ. ఏసరిని జెయ్యిసాచిన నెనసి చుక్క
లందుకొనవచ్చు శ్రీవేంకటాద్రిమనుజ
రాణ్మహేంద్ర విలాసహర్మ్యంబు మహిమ
వర్ణనముసేయఁ బరమె యెవ్వారికైన.

క. ఇలఁగలనృపతులు నీతోఁ
దులదూఁగకయున్న నీవు తులదూఁగితివా
బళిబళి బంగారముతో
బలసాంద్రా! వేంకటాద్రి పార్థివచంద్రా!

మ. మరుగుల్ గొల్సులు చంద్రహారములు సమ్మోదో క్తినిద్ధంపుటుం
గరముల్ పోగులు పల్లకీలు హయసంఘం బగ్రహారంబులున్
మెఱయం జాలినసేలువుల్ ధనము నెమ్మిన్ వేంకటాద్రీంద్రుచే
తఱచున్ గొన్న బహుస్థితుల్ గలిగి విద్వాంసుల్ సుఖంబందరే.

గీ. వైభవోపేంద్రుఁ డైనట్టివాసిరెడ్డి
వేంకటాద్రీంద్రుఁ డొకపెండ్లివేళయందుఁ
జిన్నదొరలకు నత్తరుకొన్నకర్చు
పృథ్విఁ గలరాచవారికిఁ బెండ్లికర్చు.

శా. తేజఃకాంతివితీర్ణిభోగకరుణా ధీసారతన్ బద్మినీ
రాజున్ రాజును రాజరాజు సుమనోరాజున్ నదీరాజు వా
గ్రాజున్ బర్వతరాజు మీఱితివి నీకా సాటి భూరాజు లో
రాజశ్రీయుతవాసిరెడ్డికులచంద్రా! వేంకటాద్రీశ్వరా!

క. వెన్నెలవలెఁ గర్పూరపుఁ
దిన్నెలవలె నీదుకీర్తి దిగ్దేశములం
దౌన్నత్యంబున వెలసెను
విన్నావా వాసిరెడ్డివేంకటనృపతీ!

సీ. దేవరకోటాఖ్య దేశాధిపత్యంబు
గద్దిమించిన రేపల్లెగడ్డవారు
సేనాధిపత్యంబు చేతను మెప్పించు
శూరవర్యులు శాకమూరివారు
అరయఁగఁ బసుపాటి ననుసరించెడుమంచి
చేవచే మించెడు చేవవారు
కులగోత్రసంపద గలిగి రాజప్రీతి
మెఱఁగినట్టి చిఱుమామిళ్లవారు
గీ.: మొదలుగాఁగల బంధువుల్ మోద మలర
మస్నెసుల్తాన్ బహాద్దరు మంచినృపుడు
మఱియు బంధుసముద్రుండు మానఘనుఁ డ
టంచువర్ణింతు రెపుడు నాయనిపతిని.
సీ. దీపాలమిసిరవల్ తాఁపినబంగారు
టోపీ శిరంబందు నేప్రుమూప
రంగైనసీమస్త రంగీజరీచెట్ల
లుంగీ హొరాయల్ మీఱి చెంగలింప
గుజరాతికెంపులకూర్పు తీన్నసయొప్పు
పల్వారుపై నవ్వుచెల్వు దనర
మేచారమునఁ బచ్చపోఁచీ కరంబదు
మేల్మిజీఱలముద్దు లల్కుకొనఁగ
గీ. ఆరసిచిగురాకుఁ దరవారు మరువజీరు
... ... ...

శ్రీవేంకటాద్రినాయనివా రొకదినమున "నందన" మనెడి యమునా పతియందలి వాటిస్వీయోద్యానంబున విహరించుచుండ ములుగు పాపయారాధ్యులవారు దర్శించి యీక్రిందిపద్యము చెప్పిరట.

సీ. సురసరిద్ధరణియుగ్ద్విరదపద్ధిషదకుధ్ర
ద్ధరశరచ్ఛరదర స్ఫురితకీర్తి,
హరిసఖస్వరుహరి ద్ధరికరోద్ధురభయం
కరకరోత్కరముఖ క్షురదరాతి
సురభికిన్నరకులేశ్వరసుతస్మరమరు
ద్వరజనుస్స్వరుచిసుంచరతనుండు
తరణిభూశరదనిర్జరకురుట్స్వరగవి
హరసఖామనమణీ పరవితీర్ణి
గీ. నృపతిమాత్రుండె యాశ్రితనివహపద్మ
భానుఁడై భూరిధీరతానూనరత్న
సానుఁడగు వాసిరెడ్డివంశప్రసిద్ధ
వేంకటాద్రిప్రభుండు రవిప్రభుండు.

నాయనిగారు "తాతా! యిట్టియుద్యానవన మున్నందులకుఁ దగినఫలము లభింపదయ్యెను. ఇది మీబోఁటికవిశేఖరులకే యనుభవయోగ్యము గాఁదయ్యెను. సౌరభభరిత పుష్పగుచ్ఛము లెన్నియున్న నేమి ఫలము? మిముఁబోఁటి కవివరేణ్యులచే గండోపలప్రహారంబుల ననుభవింపవలసె" ననిరట. అంత పాపయారాధ్యులవా రీక్రిందిపద్యముఁ జదివిరట.

సీ. భములతో సురపాదపములతో గంగోద
కములతో నీహారికములతో ద
హేతితో నమరేంద్రనీతితో నైలింప
వీథితో పరమేష్ఠిసూతితో ద
నవ్వుతో విరిమల్లెపువ్వుతో జేజేల
బువ్వతో పలుకులయవ్వతో దఁ
శాలితో గూఢపాత్పాలితో మౌక్తిక
పాళితో సారంగపాళితోడ

గీ. మొల్లమున నల్లి బిగ్గనై యెల్లజగము
నల్లుకొని నీయశోవల్లి యుల్లసిల్లు
శ్రీవిభాసితజన్గభూభృత్తనూజ
వెంకటాద్రీంద్ర నృపచంద్ర విజయసాంద్ర.

క. జలజారికళలయందును
గలశాంబుధియందుఁ జన్నగప్రభునందున్
వెలదై యలదై తెలదై
యలరన్ నీకీర్తి వేంకటాద్రిమహీశా!

సీ. ధరణి నేవిభుఁ డప్రతనభోజరా జంచు
విద్వద్గణంబుచే వినుతిగాంచె
నెరయ నేఘనుఁ డిదానీంతనరాధేయుఁ
డని రాజసభలఁ బ్రఖ్యాతిఁ గాంచెఁ
నేనృపుం డైదందయుగీ యార్జునుండని
సూరులచేతఁ బ్రస్తుతివహించె
నేమహాప్రభునగ్యుఁ డిల నధునాతన
రుక్మాంగదుఁడని శ్లాఘిమించె

గీ. నఖిలవిద్యాపరిశ్రమా త్యంతదాన
శౌర్యహరివాసరవ్రత చర్యలందు
నట్టిశ్రీవాసిరెడ్డివం శాబ్ధిపూర్ణ
చంద్రుఁడగు వేంకటాద్రిభూ త్రీంద్రుఁ డలరు.

మ. సురభూమీరుహసంచకంబున రమా సూనుండు నొక్కొక్కశా
ఖ రహిన్ గైకొని వాసిరెడ్డికులరాకాచంద్రుఁడౌ వేంకటా
ద్రిరసాధీశుని పంచశాఖముగఁ గూర్చె న్నేఁడు మాకు న్మహే
శ్వరపూజాతిశయం బటంచు సురభూజజంబుల్ నుడంబడెన్.

ఉ. సోముఁడు లేనిరాత్రివలె సూర్యుఁడు లేనిదినంబురీతి శ్రీ
రాముఁడులేనయోధ్యవలె రాజకులేంద్రుఁడు వాసిరెడ్డి సు
త్రాముఁడు గానరాని యమరావతిపెంపు చెడెఁ గాలమానముల్
గామవిరోధికిం గడవఁగాదుగదా మది శంక లేటికిన్.

ఈక్రిందిసీసము సోమయాచార్యులవారు శ్రీవేంకటాద్రినాయనింగారి పిన తండ్రికుమారులైన నాయఁడమ్మగారిపైఁ జెప్పినది:—

సీ. ఘనసారశరశరద్ఘనసారనీహార
ఘనసారశైలయొప్పు ఘనయశంబు
విక్రమార్కునితోడ విక్రమింపఁగఁజాలు
శక్రాభనిర్వక్రవిక్రమంబు
కల్పభూమిజసంకల్పభూశతజన్మ
కల్పభూరిత్యాగకాంతతాప్తి
రాజరాజనిలింప రాజరాజత్సుధీ
భాజనంబైనట్టి భాగ్యగరిమ
గీ. సికతవిలసిల్లవలెఁ బార్వతీసమేత
రామలింగేశ్వరకృపావిధరంబునలనఁ
బ్రకటతరచిరంబగు వాసిరెడ్డి కులసింహ
నరులకల్పద్రుమావుఁ గొమ్మ! నాయఁడమ్మ.

## వాసిరెడ్డిరామనాథబాబు.

ఈయన వేంకటాద్రినాయనికుమారుఁడు. వీరికాలముననే వేంకటాద్రినాయనింగారార్జించిన ప్రాజ్యమగురాజ్యము యథాయథ లయినది.

సీ. సుల్తానుబహాదరీచూపించినలఖాబు
ఇచ్చవచ్చినలచ్చులిచ్చు జేబు
కయివారములుసేయు వికిచ్చుతసితరీబు
కానుకల్ కీలతోఁగూడు ... కాబు

అలకాధిపతికైన నప్పు లిచ్చెడిరీబు
చలపట్టి సేయువైరులఖరాబు
వాసిరెడ్డికులాబ్ధి వర్ధిల్లుమహతాబు
సర్కారు సారించుసరిజవాబు
గీ. జబరదస్తులకెల్ల దుర్సానబాబు
కన్ను వేసిందిచూ తమ్మికంటిమీబాబు
ననవీవోల్లాసి మారామనాథబాబు.

## శ్రీధనంజయధాత్రీరాజు.

ఈతఁడు విశాఖపట్టణమండలమందలి పార్వతీపురప్రభువు. పంతుల బ్రహ్మయ శాస్త్రియను కవి యీతనిఁగూర్చి చెప్పిన పద్యములు:—

సీ. భటులకోలాహలార్భటుల గుండెలుబ్రీల
పుండరీకంబులు బెండుపడఁగ
బలువేఁటకుక్కల ఘోరవంబుల
నడవిపందులు గుండెల్లవిసిపడఁగ
తమతుపాకీవేట్ల ధనుధనంధనముల
క్షణములో మృగములగములుఁగూల
కెలఁకుల జనులెల్లఁ గేరి కేకలువేయ
జయజయధ్వని వందిజనము సేయ
గీ. వేఁట గావించితిరి వనవీధియందు
నర్జునపరాక్రమంబుచే నతిశయించి
మహితశ్రీవీరవరితోద్ర మల్బిరుదున
శ్రీధనంజయధాత్రీశ! క్షితిబిడౌజ.
సీ. సొగసైనరత్నాల జిగిగుల్కుమేల్తాజు
హాసుగా నొదలవాసినింప

ముఖచంద్రు నిరుడ్రేకవ మొనయు కీర్తులపోల్కి
వజ్రాలచౌకట్లు వన్నె లొలుక
సరసకవీంద్ర రక్షణవిచక్షణ నేత్ర
రాజీవముల దయారసముగుల్క
సకలసనీ పక్షశ్రవణంబు లింపొంద
శుచిధామ మధురవాగ్రచన లెసఁగ

గీ. నలుత హారమంజిమముత్యాలసరులు దనర
గంతుని జయంతు నలమహీకాంతు గెలిచి
వెలయుమిముఁ గన్నఁ గనులకు విందుగాదె
శ్రీధనంజయధాత్రీరాజ! క్షితిబిడౌజ.

సీ. నుదుటఁ బాపటబొట్టు పసనుకస్తురిచుక్క
మెడను గండపురేక మేల్మి సుఁగు
సొగసుచెక్కులనింపు జునపాలబులుసొంపు
మోవియందు బులాకిముత్తియంబు
పైఠిణీ సైక క్రొంబట్టు కుచ్చులజడ
తళుకుతాబేదు జల్తారువాణి
మొలనూలుగంటలు జిలుఁగు పావంజీలు
మోముందుఁ జిలుసవ్వ మొలకలెత్త

గీ. రంగుమీఱంగ మదనసామ్రాజ్యలక్ష్మి
విధముగా వచ్చి కప్పురవిడియ మిచ్చి
కౌఁగిటను గ్రుచ్చి బావికీ ల్కదలను మెచ్చి
మచ్చికిచ్చిన ముద్దును మఱవనగ్గు,

గీ. పంతులవంశ బ్రహ్మకవి పార్థివ లోకలలామ! దేవిడీ
చెంతికుఁజేరి దర్శనముఁజేయఁ బ్రతీక్షయొనర్చుచుండెన

త్యంతదయారసార్ద్రిహృదయంబున సన్నిధిఁజేర్చునాజ్ఞదూ
రాంతరవర్తి కిమ్మ సముదారధనంజయధాటరాణ్మణీ.

క. ననవలె ననవలె చెలికం
గనవలెఁ గనవలె మృదుత్వగరిమ మధురిమన్
ఘనమగు భవత్కవిత్వం
బనుపమతేజా! ధనంజయనృపబిడౌజా!

## మంత్రులు.

సీ. వ్రాయను జదువను బరుసతో మాటాడ
నావలీవలిపలుకు లాలకింప
పరదేశభాషలు ప్రభువుకు వినిపింప
సభదుర్గుణంబులు సర్దుచేయఁ
మనవులుగదియింప మనసులేకము చేయ
గపటనిష్కపటముల్ కలయ నెఱుప
కలిపింప విడిపింపఁ గరుణింప మన్నింపఁ
బరనృపాళికిరాజ్యపదవిఁదీర్ప
గీ. సభలఁగూర్చుండి చిత్రప్రసంగ మాడ
సరససంగీతసాహిత్యసరణి నెఱప
వినయగాంభీర్యచాతుర్యవిభరణముల
నేర్పుగల్గినమంత్రులునీతిపరులు.

## దేవనారాయణామాత్యుఁడు.

శా. శ్రీత్యాకాశదిశావకాశముల ముంచెన్ దేవనారాయణా
మాత్యగ్రామణికీర్తిచంద్రికలు ఝుంపాతాళమానక్రియా
నృత్యద్ధూర్జటిజూటకోటరకుటీప్రేంఖద్దివ్యాపగాహినీ
ప్రత్యగ్బుద్ధవిశుద్ధఫేనపటలీపాటచ్చరప్రౌఢిమన్.

## రాయని భాస్కరుఁడు.

చ. కరములు వేయునుం గలుగఁగా ఫల మేమిటొ నర్చ్చి భాస్కరుం
డరులను వేడుకొంచుఁ దిరుగాడును బంగరుకొండచుట్టు శ్రీ
కరుఁడగు భాస్కరేంద్రుకులగణ్యుఁడు రాయనిభాస్కరన్న వే
కరములు యాచకాంబుజవికాసకరంబులు శ్రీకరంబులున్.

ఉ. ఆకులవ్రాలు వ్రాయ సచివాగ్రణి బాచనకే ఘటిల్లుఁబ
ల్గాకిసుమంత్రిసంపదలు గంటము ముట్టి లిఖించినట్టి వ్రా
లాకులు రాటపాకులు చెవాకులు బ్రాహ్మణవీథిలోనిపు
ల్లాకులు బంజెలింట్లఁ పలుగాకులు గాక నిజాన కాకులే!

ఉ. వ్రాయుఁ బసిండిగంటమున రాజహితైకరహస్య కార్యముల్
వ్రాయు ధనార్థికోటినిటలంబున శోభనభాగ్యసంపదల్
వ్రాయుఁ జకోరలోచనల వక్షమునచన్నుల మన్మథాంకముల్
రాయనిమంత్రి భాస్కరుఁడు వ్రాసినవ్రాఁతలసంఖ్యములు గదా.

## కోట సింగమంత్రి.

ఉ. భానుజుఁ డర్థముం గుముదబాంధవుఁ డాయమృతంబు మేఘుఁడున్
దానజలంబు నన్ను మదినమ్మ జుఁడున్ గలవేళ నిత్తురా
వాన్ని వానివాని మఱివానినిఁ జెప్పకు కోటసింగఁడే
మానక కాంచనామృతసమానజలాన్నము లిచ్చు నెప్పుడున్.

## గుంటుపల్లి — ముత్తయమంత్రి.

చ. ఎలమిని నించి బంధుజనుల్లను హాత్తిఁ బ్రమత్తులై సరా
జులు సభలక్ష్మహామహిమ సూచుచు మ్రొక్కనాఁ జేతులెత్తి మా
ర్మలయు బ్రహ్మతెక్కె తీక్ష్ణసుమంత్రులు పొందము ...త్తి కీవిమై
వెలసితి సారె గుంటుపల్లి ముత్త నదాన్యశేఖరా!

శా. ముత్తామాత్య పతాక! కంపనగరీమూర్ధన్య! మత్తారిరా
హుత్తోన్మత్తన జీరవారపరివారోదారసాహోనమ
ద్ధత్తోపాయనదానలోల యిదిగో దండంబు లర్పించెదన్
జిత్తాంభోరుహపీఠశోభితమహాచేతోభవారాతికిన్.

మ. శతమన్యుం డమరావతేలఁగ సురల్ సత్త్రాలపాలై రి సం
గతిఁ బాతాళము శేషుఁడేలఁగ ఫణుల్ గాల్గానటించుండె నీ
క్షితి నీవేలఁగ వీరముత్త! మనుజుల్ శ్రీగంధముల్ పుష్పముల్
హితరాజాన్నము గల్గి యుండి సుఖులై రెల్లప్పు డుల్లాసులై

శా. నావిర్వ్యత్కవితావిశృంఖలనచోనైపుణ్యధారాళధా
రావష్టంభవిజృంభణంబునకు నారా వీరముత్తప్రభా
నావిర్భూతవితీర్ణి కర్గనలె లేదా యన్యుల న్వేఁడనా
ఛీ వాచాస్ఫుటి! ఛీ కవిత్వము! ఛిఛీఛీ!! యర్థకాంక్షారతుల్!

చ. కమలభవాండభాండమునఁ గల్గిన! సందివరంపు టింట్లలోఁ
బ్రముఖుఁడు రాయసప్రభుని భాస్కరుఁడే నెఱదాత; పిమ్మటన్
విమలగుణౌఘుఁ గుంటుపలి వీరయముత్తఁడె దాత భట్టుసం
భ్రమఘనదానయూథినొక పాటిని దాన్యుల నెన్న నేటికిన్

క. నాలుగుదుర్గంబులు పసు
నాలుగుదేశముల ప్రజల నియమామున్
లాలించుచుఁ జిరకాలము
పాలించెను ముత్తమంత్రి ప్రభుమాత్రుండే

క. పొందుగ శరజలనిధిహరి
చందనతరుచంద్రసంఖ్యశకవర్షంబుల్
దుందుభి నాషాఢంబున
నందముగా వీరముత్తఁ డరిగెన్ దివికిన్

## సాళ్వతిమ్మరుసు.

క. ఏతెంతువు తముఁ దామే
దాతలసన్నిష్ఠికి సర్వత్రతు లుర్వీశుక
ప్రాతమునకుఁ జూతమహీ
జాత మ్మెంపిపదె కమ్మ! సాళువతిమ్మా!

## కోనమరుసు.

క. చేపట్టిన ప్రభువులపుడురు
కోపించిన రంగోఁగూడుకొందురు జగతిన్
స్థాపింపఁ బోడుననేరని
యాపందలు సాళ్వకోనమరుసు నకెనయే

## మహిమలూరి పెమ్మయసింగన.

క. సంపదలు జలతరంగము
లింపలరఁగ వచ్చుఁ బోవు నిమ్మహిలో మేల్
సంపాదింపఁగవలెరా
పెంపలరఁగ మహిమలూరి పెమ్మయసింగా!

## సింగయరామన.

క. చేతికి గంటమువస్తే
క్రోఁతికి సిర మెత్తినట్లు కొందఱుమంత్రుల్
నీతిదొలుంగక బిసుతురు
సీతారామాభిరామ సింగయరామా!

## భట్టిప్రోలు మల్లయామంత్రి.

ఉ. నీవలెనిచ్చుదాత ధరణీస్థలిలో మును కర్ణుఁ డొక్కఁడే
నీవలె మాటలాడుతరి నేర్పరియౌ నిల శేషుఁ డొక్కఁడే

నీవలెసుందరాంగకమనీయతరుఁడు జయంతుఁడొక్కఁడే
భావితబట్టిప్రోలు కులపావనమల్లయమంత్రి ధీమణీ.!

మాదిరాజు వేంకటమంత్రి,

క. అన్నా మంత్రిశిఖామణి
నిన్నెప్పుడుఁగోనసీమనియోగ్యాగులలో
నెన్నికదాతపటంచును
విన్నాగముమాదిరాజువేంకటమంత్రీ!

డొక్కా సీతమ్మగారు.

ఈమె నిరతాన్నప్రదాత్రిగాఁ గొలఁది కాలముక్రింద రాజోలు తాలూకాలో నున్నదట! ఈమెభర్తపేరు జోగయ.

సీ. శ్రీగల్గురాముఁ డీజోగాభిధేయుండు
ధరణీతనూజ సీతమ్మగారు
కాశివిశ్వేశుఁ డీఘనుఁడు జోగయగారు
తగునన్నపూర్ణ సీతమ్మగారు
సురకులాధీశుఁ డీజోగాభిధేయుండు
నభినవవాణి సీతమ్మగారు
దానచంద్రుఁడు జోగమానవశ్రేష్ఠుండు
నెమ్మిరోహిణియు సీతమ్మగారు

గీ. అనుచు మిము యాచకులుకొనియాడుచుంద్రు
అహహ తమభాగ్య మేమని యభినుతింతు
అతులగుణధామ డొక్కాన్వయాబ్ధిసోమ!
అవుర! జోగయనామ! సీతాభిరామ!

లోభి.

క. యాచకుఁడు లోభివానికి
రామారిఫిరంగి దానరాధేయునకున్

సూచింప దేవరాయలు
నీచపుపగిడీల నెన్న నేటికిఁ బుడమిన్.

గీ. దాతగానివాని ఖ్యాతిగా నెన్నిన
దాతయౌనె వాఁడు ధరణిలోన
గడ్డిపరకపీఁకి గంగ నల్లార్చిన
దర్భయగునె యజ్ఞతంత్రమునకు.

ఉ. తిట్టిన రోసముంబడఁడు దీవనయిచ్చిన సంతసింపఁ డా
కట్టెఁడిలోభి కెంతయధికారముగల్గిన నేమి? లేకయే
బెట్టుగనున్న నేమి? నడపీనుఁగుకున్ మణిభూషణంబులన్
బెట్టిన మొట్టినన్ సరియె మెచ్చునొ నొచ్చునొ కాళికేశ్వరీ!

ఉ. ఎవ్వరిసొమ్ము నెంతదిన నెవ్వరికున్నదొ ప్రాప్తికల్గినన్
దవ్వులనున్నఁ బిల్చి తముఁదాగ యొసంగుదు రంతయంత పై
నవ్వల నెంతవేఁడినను నాప్రభు వెంతయొసంగఁజూచినన్
గవ్వయు నివ్వనీదు తనకర్మము పెమ్మయసింగధీమణీ!

క. అంటే వేళకు నంటును
నంటనితఱి నంట దెంతయలమటపడినన్
అంటే భాగ్యంబుంటే
నింటికిఁ దా నడచివచ్చు నిమ్మహిలోనన్.

ఉ. క్రూరగణంబు మందు విషగుంభితవాక్యము గుండు పద్యమా
ఘోరపుబల్ ఫిరంగి కవికోపము వహ్నియు నంటి నూటిగాఁ
గూరిక బారుసాగి కొనగుండు దగ్గాదడి దూఁకి తాఁకినన్
సారెకు లోభితూలఁబడు సాలమహీజము కూలునట్లుగన్.

ఉ. మొండిశిఖండిలోభులను ముఖ్యజనావళి వేఁడఁబోయితే
దండమనేది, రెణ్ణాలు తాళు మనేది, మఱింతనొక్కితే

నుండు మనేది, యీడెవస వెూర్చు మనేది, సహించిచూచితే
మండిపడేది కొండిచెయి మాటుఁ కోనేది వివాదపద్ధతిన్.

శా. ఇచ్చే వెన్నఁడులేద యిత్తు ననెనా యీప్రొద్దురా రేపురా
వచ్చేరోటికిరా యమాసపయిరా పద్దమ్మఁగారా ధరల్
హెచ్చేటప్పుడురా మఱొక్కపుడురా యీమధ్యతంటాలచేఁ
జచ్చేనన్నను గవ్వలేదుగదరా చాగంబు లోభిప్రభూ!

ఉ. ఇంతుల కిచ్చినట్లు సుకవీంద్రుల కియ్య రదేమిచోద్యమో
యింతులు చెంతఁజేరి యెలయింతురు పైకొనువేళ మోవి నా
కింతురు గాఢబంధరతికేళిసుఖంబున నోరితమ్మ తి
న్పింతురుచెక్కునొక్కి మఱపింతురు మే నిఁక నేమిచోద్యమో!

గీ. విత్తమొకని కిచ్చి వితరణభరణంపుఁ
జిత్త మొకని కిచ్చి చెఱిచినాఁడు
బ్రహ్మయాలిత్రాడు బండిఱేవునఁద్రెంచ
రెండు నొకని కీక బండుచేసె.

## తంగెడకొండఁడు.

ఉ. పింగళి యేకచక్రపురి పెంపుగ నందు వసించియున్నయా
తంగెడకొండఁడే బకుఁడు తథ్యము మానవులార! వాని బా
ధం గడముట్టఁ జేసె మును ధర్మజు తమ్ముఁడు భీముఁ డిప్డు డా
యొంగిలిముచ్చుఁ జంపుటకు నీశ్వరు వేఁడుఁడి భీముఁ డయ్యెడున్.

## వనమయగారితుక్కన.

చ. మును పాకకేల రావణుఁడు మోదమునన్ రజతాద్రి యెత్తినం
తనె హరుఁ డోపఁడే తనపదంబునఁ ద్రొక్కి మదంబ డంపఁగా
వనమయగారితుక్కసచివా యలశ్రీగిరి గద్దపాఱలన్
గనలుచుఁ ద్రవ్వి సర్వమును గైకొనునీ కిపు డాతఁ డోపఁడే!

## బాచమరుసు.

[పలుకలూరి గోపన చెప్పినది]

గీ. గోలకొండమలక గోవులభక్షించుఁ
గొండవీటి విప్రకులము నెల్ల
బాచమరుసు చేరి భక్షించుచున్నాఁడు
మలక మేలొ బాచమరుసు మేలొ.

## బెహారాదారన.

ఒకానొక బాట్లసారి 'బేచిరా' కయిన దని యెఱుఁగక క్రింది యగ్రహారము పేరువిని వెళ్లి వెదకి కానక విసిగి చెప్పినపద్యమట!

ఉ. కాసరకూసరై మిగులగందరగోళపుమూలమై రసా
భాసపుహేతువై వికటపద్ధతిరై సిగపట్లగోత్రమై
దాసరిపాటరై బెహరదారన చేసిన యగ్రహార మా
కాశముముట్టి తోఁకతెగి గాడిదవాలకమయ్యెఁ జూడఁగాన్

## పుత్రేపు — వేంకట్రాయఁడు

క. పుత్రేపువంశభవ వెం
కట్రావా! దుస్స్వభావ! గాడ్ద(!)గ్రీవా
నిట్రాచట్రావిభవా
భట్రాజులకియ్యలేవు బడవా! చెడవా!

## పేరు లేనివాడు.

సీ. వేడ్క నిద్దఱతోడ వీథిలో నిలుచుండి
జోడుగా ముచ్చటలాడ భయము
కొంప పొరుగఁ గట్టుకొని కాపురంబుండి
తెల్లపిబట్టతోఁ దిరుగ భయము
గంధాక్షతలు పెట్టి కడుపార భుజియించి
నిండార వీథిలో నిలువ భయము

శుభశోభనములందు సొంపుగా స్త్రీలతో
రాగిల్లి యూరనూరేఁగ భయము
గీ. సెట్టి సంగీతొడిగి పాఁగచుట్ట భయము
బ్రాహ్మణులపాలిమృత్యువు పాపజాతి
కలిసచిత్తుఁడు పీఁడమ్మకడుపుగాల .

... ...

మఱికొందఱు.

ఉ. బానెఁడుజొన్నవంటకము పంకెఁడుపాలును మేటిచారు లెం
తేనియుఁ బుల్లఁగూర కడుఁదేరినమజ్జిగ పెద్దచెంబెడున్
బూనిచి కమ్మచాదరులు బొజ్జలు పెంచుక కొండవీటిలోఁ
గానరు కుంభకర్ణ గజకర్ణ హిడింబ బకాసురాదులన్.

ఉ. తిండికిఁ గుంజరంబులు విపీర్ణికిఁ గంటకిభూరుహంబులున్
పండ ... గృహంబులను దండధరుల్ రణరంగభూమికిన్
ముండలు పండగోఁకరులు ముచ్చటకుం గొఱగానివార లి
మ్మండలమందుఁ గొంద అధమోధమకమ్మబికారిత్రిమ్మరుల్.

క. పిండెంత రొట్టెయంతే
మండలపతిమును వసెంత మానుష్య మంతే
గుండెంత తూనికంతే
మిండనియా వెంత లంజె మేలను నంతే.

చౌకదనము.

సీ. అత్తవారింటిలో నల్లుఁడు తఱుచుగాఁ
జనవున మెలఁగుట చౌకదనము
పరమాప్తులయినను బాంధవులిండ్లకు
సారెసఁ బోవుట చౌకదనము

ప్రజకు సమ్మతిలేని పొరుపత్త్రము చేసి
చాలించుకొనియుంట చౌకదనము
తనభూమిఁ గోల్పోయి తా నెంతరాజైన
సరివారిఁ జేరుట చౌకదనము
గీ. గాన యభిమానవంతుఁడు గౌరవమున
దూరమున నుండి మర్యాద తొలఁగకుండ
సంచితం బగుయశము దక్కించుకొనును
వేంకటాద్ర్యక్ష వికసితపంకజాక్ష!

తీర్పరి.

సీ. తగవునఁ గూర్చుండి ధర్మంబుదప్పెనా
తప్ప కాతనికళత్రముకుఁ దాఁకు
అర్థంబు నేపాటియాసించి చెప్పెనా
యుభయవంశంబులు నుడిగిపోను
పక్షపాతము చేసి పాప మార్జించెనా
తొలఁగక యతనిపుత్త్రిలకుఁ దాఁకు
కపటియై తగ వెఱుంగక తప్పఁజెప్పెనా
కాలునిపురికిఁ దాఁ గదియ నేఁగు
గీ. వాదిప్రతివాదిమాటలవరుస నెఱిఁగి
యుభయసాక్షుల పల్కుల నుచిత మెఱిఁగి
సత్యమైనట్టిమాటలజాడ యెఱిఁగి
తగవుతీర్చినయతఁడెపో ధర్మరాజు.
క. ధర్మముచెడి రెండాడిన
దుర్మార్గుఁడుగ్రహముపట్టు తుడిచినవధూళై
నిర్మూలో న్మూలంబై
ధర్మజుపురికేఁగి మలముద్రావుచునుండుఁ

చ. ప్రసమించి సత్యసంధుఁడగు పుణ్యునినోరు పవిత్ర మెప్పుడున్
పడియత నాని నూటి కొకమాటయినన్ నిజమాడనేర నా
గమసరినోరు నోరె యతికష్టపుఁగంపిడిబేజలారినీ
ల్వాపలెడిక్రంత తుంపెరపుకీహనుమంత నితాంతవైభవా.

తూర్పునాడు.

సీ. శ్రీరామ? పతిపేళ్లు దొరలు రాచకొమాళ్లు
వెలమనాయళ్లు చేవెళ్లు గోళ్లు
కాళ్లను బాంకోళ్లు కడునోరసిగముళ్లు
వింతకట్టురుమాళ్లు బంతికూళ్లు
చెవులపోఁగులజోళ్లు చేయూఁ టెపదిమూళ్లు
మాటవ్యక్తపునోళ్లు వేఁటకాళ్లు
వెలిరారుమగనాళ్లు పెనుబాలకావళ్లు
గొల్లబోయళ్లు పైఁడెల్లజోళ్లు
గీ. చాలుసామిళ్లు తాళ్లు వజ్రాఘ్రాళ్లు
నీళ్లు గలయూళ్లు నడవికుంటేళ్లు లేళ్లు
మహాలుకట్టళ్లు పాఁతళ్లు మానుటోళ్లు
మెప్పు నడవళ్లు తూర్పున నుప్పుమళ్లు.

కర్ణాట దేశము.

సీ. జిలుగువన్నెరుమాళ్లు చెవులముత్యపుజోళ్లు
వెగటైనవడదోళ్లు వేఁటకాళ్లు
వారకాంతలయిళ్లు వచ్చురాచకొమాళ్లు
నారీమణులపెళ్లు నారికెళ్లు
వాసించువటివేళ్లు వారిజాక్షీనగళ్లు
దాసరిదేవళ్లు తేఱుముగుళ్లు

శృంగారసావళ్లు బంగారు మెడనూళ్లు
నిగ్గైనమద్దెళ్లు నేర్పుకాళ్లు

గీ. ఎట్టివారికిఁ గలరయ్యా యిద్దఱాళ్లు
సంతతంబును దమయొద్ద బంతిపూళ్లు
మాటనిలుకళ్లు మఱిమంచినీటుకాళ్లు
పొందుకర్ణాటదేశపుఁ బొందుకాళ్లు.

సీ. కాసుపుట్టనిమూళ్లు కేలవు మజ్జిగనీళ్లు
పడిపొళ్లుచేనళ్లు పాడుగుళ్లు
సరిజేసిసావళ్లు మొఱాలు పెట్టు వఱళ్లు
పరుగుపొత్తడిలేళ్లు పలుఁగుఱాళ్లు
చౌటవాఁగులనీళ్లు సరకు తేసంగళ్లు
పెనులోభులనగళ్లు పిచ్చపళ్లు
పంచదమునఁదొరసోళ్లు మడ్డిచెక్కలపోళ్లు
తెంగ[?]శివసాళ్లు తెల్లనూళ్లు

గీ. చివికిపోయినపందిళ్లు చింపిదళ్లు
పరాచకొమాళ్లు తబ్బిబ్బుపేళ్లు
తోడుఁబోతులవడుసుళ్లు తుమ్మసీళ్లు
పోరుమామిళ్లనడపళ్లు పూటకూళ్లు.

## కొండవీటిసీమ సముతులు.

సీ. కొండవీటిసీమకోరుక్కలు దీర్పంగ
పండిసముతులు సంద్రెండు రెండు
ఎలమితోఁ జెప్పెను, ఏజేదియన్నటినా
పొలుద్దు ఫులిపట్టు ప్రత్తిపాడు
పంతసరావూరు పరసను నూతక్కి
పొంతను చేబ్రోలు పొన్నసూరు

మంగళగిరియును మఱి మంచిమనుగోడు
తంగై ననాచెండ్ల రాయపూఁడి
గీ. దాచినధనంబువంటిది కూచిపూఁడి
పంట లధికంబు గుంటూరు ప్రజలకెల్ల
పాడిబానలు గలిగుండు తాడికొండ
పరమమల్లేశ శివలింగ! పార్వతీశ.

## మాచెర్లసీమ.

సీ. సిరిమించుమాచెర్ల సీమదేశంబునఁ
దుదముట్టఁజూచినఁ దువ్వభూమి
ఆభూమిపంటలు నారికె కందులు
చామలు నువులు సజ్జలు మఱి
వరుసతోఁ గొఱ్ఱలు వరిగ అల్చందలు
నములు పెసరును నాముదాలు
ప్రత్తియు రాగులు పాలెపుజొన్నలు
పదునాల్గు వన్నెలపంట గలదు
గీ. అందుఁగూరగాయ లనువైనగోఁగులు
పుచ్చకాయ తుమ్మిపులుసుఁగూర
పాలుపెరుగు నెయ్యి పరిపాటిగాఁ గద్దు
ఇంతకన్న లేద యెంచిచూడ.

## వీరవకనుపూరు, కొల్లుకుదురు.

ఈరెండుగ్రామములును నెల్లూరిదగ్గఱనున్నవి.

ఆ. వె. ఊరిచుట్టుముండ్లు నుదకంబు మధ్యంబు
పాడిపంట సున్న ఫలము నాస్తి

తీరు దినుసు లేనివీరనకనుపూరు
పాడుకొంప దీసి త్రాడు ద్రెంప

ఆ. వె. ఒక్కపాఁ పెగేసి యొక్కపాలు దిగేసి
ఉన్నయూరిమీఁద మన్నుబోసి
పాపరాజుపోయెఁ బారుపత్తియుఁబోయె
కొల్లుకుదురుమీఁదఁ గొఱవిపెట్టి.

## ఉదయగిరి రాజ్యలక్ష్మి.

క. ఉదయగిరి రాజ్యలక్ష్మికి
సదనము నెల్లూరు, అట్టిసాధ్వీమణికిన్
వదనంబు కందుకూరున్
బదయుగళం బాత్మకూరు బట్టేపాడున్.

## కొప్పోలువృత్తాంతము.

“శ్రీకృష్ణదేవరాయలచేఁ గొప్పోలుగ్రామమును బొడ్డుచెర్లతిమ్మన యగ్రహారముగాఁ బడసెను (ప్రథమభాగము చూచునది.) అతిమ్మనమంత్రికుమారుఁడు వెంగన్న యాకొప్పోలుగ్రామమునకుఁ బాపఘ్నినదినుండి కాలువత్రవ్వించి నాగులకుంట యనుపేర నొకచెర్వునిర్మించి యానీటిచేతఁ దనయగ్రహారమును నదీమాతృకము చేసికొని యనుభవించుచుండెనట! దానికోర్వక తమకేదో నష్టము కలుగుచున్నదని తెంబాక నాగిరెడ్డియనునాతఁడు తద్గ్రామాధికారిగా నున్నపోచిరాజు ఓబన్నతోఁ గ్రావటునఁ వెంగన్నమీఁదఁ దగవు సాగించెనట! అప్పుడు దేశాధీశ్వరుఁడుగానున్న మట్ల-కుమారఅనంతరాజుగారికిని కేఁగి బొడ్డుచెర్ల వెంగన్న విన్నవించుకొన్న విధము:—

సీ. కొప్పోలుకడ శిలాకుంజరంబులమీఁదఁ
గోలాహలంబాడెఁ గోలకట్టి
తగ కృష్ణరాయేంద్రదత్తాగ్రహారంబు
నాశంబుగాఁ జూచె నాగిరెడ్డి

యారాజ(?)నరనాథకన్యకైన పెనుగాల్వ
కూఁతుఁ ద్రొబ్బఁగఁ బుట్టెఁ గుంటకొట్టి
వెలయ వామనమహోత్పలశాసనంబులు(?)
తల్లడంబులు చేసె నల్లఁ దహహా
గీ. విని పరామరిసించు మావిన్నపంబు
చిత్తమున నుంచు పోషితాశ్రితకలాప
మల్లకులదీప! మత్తారివంశహరద
సర్గశ్రప్రతాప! కుమారనంతభూప!.

దీనిపై ననంతరాజుగారు పెంగన్న కనుకూలముగాఁ దగవు తీర్చిరట!

పోచిరాజు - ఓబనమీఁద బొడ్డపెద్దిరంగన్న చెప్పినపద్యములు.

సీ. మహి యేలుమల్లకుమారనంతాన్వయ
మూర్ధాభిషిక్తునిపూటలేక
అ...................నాథ
మంత్రిశేఖరునిసమ్మతము లేక
కడుఁదిట్ట దీపించఁగాఁగలకొల్వబు
నరకవిశ్రేష్ఠులమొలుక లేక
అనయంబుగా పుండియన్నపన్నులుపెట్టి
మను మేటికాపులమాట లేక
గీ. కాలనష్టంబుగాఁగుంటకోట్లు మనుమ
నిచ్చె లేఁబాకవారికి నుచ్చుకమ్మ

... ... ...

గీ. గొడుగు కాలిపోయె గుజ్జంబు చనిపోయెను
నాలు తొలఁగిపోయె నల్లఁ పలిగ
నూరు మాటిపోయె నూరికి రావరా!
ఓరి పోచిరాజ నోభ! మాబ!

జాజి బల్ రక్కసి జమ్మియు దాసాని
మాచిపత్త్రి యారె మంచిములక

గీ. భాద్రపదశుద్ధమునఁ జౌతిఁ బగటివేళఁ
బప్పు పాయసమును నానుఁబ్రాలు తేనె
నేయి యుండ్రాళ్లు కుడుము లుపాయనముగఁ
గోరియర్పింతు నీకు నేఁ గోర్కె తీఱ.

క. మగ్గిళ్లు వచ్చినప్పుడె
గుగ్గిళ్లను పెసరపప్పు గుండ్రుండ్రమ్ముల్
నెగ్గైన నేతిలెప్పలు
సగ్గముఁగా నీకుఁబెత్తు నయ్య గణేశా.

గీ. పెద్దయేనుఁగుపై నెక్కి బిరుదుపడగ
లమర ముత్యాలజగజంప గొడుగునీడఁ
జిన్నినగవుల రఘువీరశేఖరుండు
ప్రేమ నేతేరఁ గోరుచున్నాము మేము.

బోగిపండుగ.

సీ. బోగిపండుగవచ్చెఁ బాంచుగా మనయింట్ల
తలయంట్లు సాగింపవలయు నేఁడు
ఎల్లి సంక్రాంతియు నెల్లుండి కను మావ
లెల్లుండి ముక్కను మేఁగుబెంచు
పండుగానిన్నాళ్లు పిండివంటలతోడ
నిష్టమృష్టాన్నంబు లింపుమీఱ
బావలు మఱఁదులు బంధుగు లల్లుండ్రు
వదినెలు మఱఁదండ్రు బంతిగుడిచి

గీ. క్రొత్తపుట్టముల్ ధరియించుకొని ముదమునఁ
గూడి కిలకిలలాడుచు వేడుకలర

పాడుపేముపాట లాటలనాడుకొంద
మోలి మనమెల్లరముగూడి బాలురార.

## కన్యాదానము.

క. శ్రీయును గులమును రూపును
బ్రాయము శుభలక్షణంబు బాంధవవిద్యా
శ్రేయములు గలుగువరుఁ గ
న్యాయుతుఁగాఁ జేయవలయు నధికప్రీతిన్.
సీ. పెండ్లికూఁతురికేమ పెట్టెటిసొమ్ములు
సరిగెపచ్చలు బన్నసరము తీగె
సౌరెలు, పిల్లాండ్లు బెబ్బులికాయలు
వీరమద్దెలు మణిహారములును
గంటలమొలనూలు దంటయొడ్డాణంబు
రంగొప్రధానంపు టుంగరంబు
సిరిగజ్జె లందెలు చేర్చుక్క బంగారు
నేవళంబుగు కొల్కిబాలివీలు
గీ. అన్నియును దెచ్చి యిచ్చెద మాదరించి
ఘనుఁడవో మామ! గంధానఁ గాళ్లుకడిగి
పిన్నవయసుఁడను నాకు మీకన్నె నిమ్ము
శ్రీకరంబుగ నాశీర్వదింపు మమ్ము.
క. పున్నమచందురు నేలెడి
చిన్నది మ్మాయింటఁగలదు; సిరితోఁ జెలువై
గనునాన్నఁడఁ బిన్నవరుఁడను
గన్నె నా కిచ్చి శుభముగై కొను మామా!
సీ. అణంబు తగుమాత్ర మడిగితి నో మామ!
జాళువా కట్ల సరిపిణీలు

పచ్చలకడియాలు పదివ్రేళ్ల బొంగ్రులు
పటువుమాణిక్యాల పతకమొకటి
బిరుదుచెక్కడపుది బిళ్లలమొలత్రాడు
జమిలిపి యుత్తరజంపెములును
తెగటుఁగోఁకులు మంచివగు రెండుసేలులు
వస్తుతురాయి జల్తారుపాగ
బంగారుపాలకి బాలీసు గొడుగులు
జాలుమతీ తేజీలు సూర్యప్రతము
సీ. కసువిలువగల్గు బంగారుకలముదారు
పనితరముమీఱు దంతంపుఁ బావుకోళ్లు
మామ యివియిచ్చి ముద్దుకుమార్త నిమ్ము
శ్రీకరంబుగ నాశీర్వచింపు మమ్ము

శ్రీకారములు.

గీ. ఒకటిసుతునకుఁ జెలికాని కొనరరెండు
మూఁడు సమునకు వైరికి మూఁతునొకటి
యేను భూపాలునకును శ్రీ లెలమి నిడుడి
సరసు లుత్తరములు వ్రాయుసమయములను.

భోజనము.

[ఈక్రింది పద్యములందుఁ గొన్ని శ్రీనాథునివి.]

ఉ. మాతని ముట్టఁగా వెఱతు ముద్దకు ముద్దకుఁ గూటిలోపలన్
బాతికపాలు సైకతము పచ్చడి కొంచెపుయాది యంత్యసుక్
జాతమటన్న లేదు మఱి సున్నముకన్నను ఉప్పుతేనన్న మీ
రాతిరిఁబోలె భోజన మరాతికినైనను వద్దు దైవమా!
సీ. పూర్వమందు విషము పుచ్చుకొన్నావని
గరళపడెన వేల కాలకంఠ!

కొండపల్లిసీమ పండు జొన్నలకూడు
తిన్ననీరుబయిసి తేటపడును.

క. పాలుబ్బజొన్నయన్నము
తోలించినవంగవరుగు తైలపు ధారల్
తేలఁ బరామర్శంబున
బాలురతోఁ గుడువఁబెట్టుభార్తల పెద్దా!

క. నడినూఁకలేనియన్నము
నడఁబోసిన నెయ్యి బుడమనరుగుఁ బెరుగుఁ
గడి మాడసేయఁ బెట్టిన
నడగూడెపునంబిపడుచు నడిగితి నసుమీ!

సీ. కఠినంపుజొన్నల కటుకుకుడుమ్ములుసూచి
వక్త్రిమా! భయపడవద్దుసుమ్ము
నానాఁచుల్ గోరు నాలుకా నీవేమి
సందేహపడవద్దు చప్పరించు
ఎన్నఁడుఁగడిచేయ నెఱుఁగ నెట్లో యని
కుడిహస్తమా! నీవు జడియఁబోకు
కమ్మనివాసనల్ గ్రక్కునగ్రోల్చెడి
గర్భమా! కుటకుటకాకయుండు.

గీ. [గీతికొంతచేకూఱకున్నది.]
వచ్చుబహుధాన్య నామసంవత్సరంబు
కాయగూరలు మనకునిక్కముగఁ గల్లు.

## స్వాపాటుబావలు.

సీ. ఆపూపసూప సప్తాంగభంజనులార
ఆజ్యసాగరబడబాగ్నులార
శ్రాద్ధాన్నభుక్తివిచారతత్పరులార
పచ్చళ్ళరుచ్లులకు మెచ్చులార

పాయసాన్నతిండికిఁ బోడుపుఁజుక్కలార
నేఁటొక్కచో వాయువేగులార
పాపకవాహినీమానభంజనులార
బొబ్బట్లదొంతుల కుబ్బులార
గీ. తక్రసాగర వాతాపివమనులార
జజ్ఞాపాటిన క్రేలుడుబొజ్జలార
దినదినము తద్దినముకోరుధీరులార
పాలు తేరయ్య! సాపాటుబాపలార.

## నీరుమజ్జిగ.

క. గొప్పైన నిమ్మపండ్లను
గప్పురమును సొంటిపొడియు గఱివేఁపాకున్
ఉప్పును నేలకు లింగువు
నొప్పగ నీచల్లరుచికి నోనగూర్పఁ దగున్.

## చలి.

సీ. అగరుకురంగ నాభాత్యుష్ణతరసుగం
ధాంగరాగము లెన్ని యలఁదుకొనిన
నికటస్ఫుటాంగార శకటప్రకటకేళి
గర్భగేహము లెన్ని కలిగియున్న
కార్పాసతూలికా ఘటితకూర్పాసక
స్తోమంబులవి యెన్ని తొడిగికొనిన
అతులితోదయ రాగహారిద్రమాంజిష్ఠ
కలితాంశుకము లెన్ని కప్పుకొనిన
గీ. మాను నేచలి నవవయోమత్తమత్త
కాశినీనవ్యకస్తూరి కాను లేప
ఘుమఘుమామోద గురుకుచకుంభగాఢ
తరపరీరంభ సంభారసరణిఁ గాక.

## వేసంగి.

ఉ. ఎండెఁ గొలంకులెల్లను మహీధరపంక్తులు వహ్నికీలచే
మండె ధరాతలం బినుపమంగలముం బలెఁ గాలియుండె నా
యెండల నేమిచెప్పఁ బరమేశ్వర యావరణాంబురాశి లే
కుండిన నాఁడె పొక్కిపడకుండునె పద్మభవాండభాండముల్

ఉ. ఆతపవహ్నిచేఁ బథికు లార్చుచు దారిని స్రుక్కి దాహసం
జాతత నెండమావులకుఁ జయ్యన నేఁగుచుఁ దప్తపాంసు సం
భూతములైన గుల్లలను బొక్కుచు దిక్కులు సూచుచున్ వెసన్
ఘాతను దూఱుచున్ మఱియుఁ దల్లడమందుచు నుందు రెయ్యెడన్.

## అనావృష్టి దోషము.

సీ. తలనున్న జల మింత తొలఁగిపోయిన యంతఁ
జిన్ని పైదలి మై స్పృశించు ననిరొ
జడనున్న మొగులింత జారిపోయిన యంత
సిగచక్కఁ జేసము క్రొంచెమున నన్నిరొ
పాదినున్న రసమింత పొంగిపోయినయంత
క్రొత్తమామబలంబు క్రుంగుననిరొ
గిరినున్న మంచింత కరగిపోయినయంత
పట్టింపుఁ జెలితండ్రి బడలుననిరొ

గీ. ధర ననావృష్టి బాధ పొల్పడిచెదేని
నీరధపు సొంపు సమ్మగు, దీమజుండి
వజ్రిచేఁ బడు, నీవిల్లు వహ్ని గలయు
నీపశుపతిత్వమును జెడు నీలకంఠ.

## నల్లి.

క. శివుఁడద్రిని శయనించుట
రవిచంద్రులు ఖింటనుంట రాజీవాక్షుం

జనిరళముగ శేషునిపైఁ
బవళించుట నల్లిబాధ పడలేక సుమీ,

## చాఁకలి.

గీ. చాఁకివానితోడ జగడాలుపడలేక
సిరిగలాఁడు పట్టుచీరగట్టె
శివుఁడు తోలుగప్పె, సీ యని మదిరోసి
భైరవుండు చీర పాఱవైచె.

## తీఁట.

క. తీఁటగలభాగ్యశాలికి
నీటుగలుగుగోళ్లు వేఁడినీళ్లు లభింపన్
దాటించి బఱుకసాగినఁ
దీఁటరొ దేవేంద్రపదవి తిరముగ జగతిన్.

## పొగాకు - పొడుము.

చ. సురవనితాసమానలగుసుందరులన్ దనియించువేళఁ జా
తురి రసికత్వమున్ ధృతి మృదూక్తులు మోహము తేటొసంగ నీ
సరి యగువస్తు వున్నదె రసజ్ఞుల కీభువనత్రయంబునన్
సురపతి నీలరత్నరుచిశోభితగాత్రమ! ధూమపత్రమా!

ఉ. పూని దివంబుకన్నఁ బొలుపొందఁగఁ జేసితి వెట్టివాని కే
దానము లాచరించినజనంబుల కీఘనలోక మబ్బున
య్యా! నళినాక్ష! నీవెఱుఁగవా చతురానన! భూమియందుఁ బెం
పైనపొగాకుఁ జుట్టలను పాత్రుల కిచ్చినయట్టివారికిన్.

ఉ. ప్రొద్దున లేచి ధూమ్రదళపుంజము కన్నుల నొత్తి యొత్తి కన్
ముద్దుగఁ జుట్టచుట్టి తనమోవిపయిం గదియించి మీసముల్
దిద్ది పొగాకు వేఁడినసుధీజనకోటికిఁ బంచిపెట్టినన్
పెద్దలపేరు చెప్పి పొగపీల్చినవారు సుపూజ్యులిమ్మహిన్.

సీ. పూర్వకాలమునాఁడు పొగఁద్రాగకుండిన
ధృతరాష్ట్రికన్నులదృష్టి తప్పె
పాండురాజును జుట్ట పాటించకుండిన
భోగంబు చెడి పాండురోగి యయ్యె
శ్రీకృష్ణుడును జుట్ట చేపట్టకుండి తా
నోగి జరాసంధున కోడిపోయె
దశరథుం డీచుట్ట తన నిషేధం బని
బుత్త్రశోకంబునఁ బొరలి చనిరి
గీ. గాన యిది హవ్యకవ్యాదికార్యములకు
ముఖ్యమగు దేవతలకెల్ల మోదమిడును
సురుచిరంబుగ వట్టుపచుట్ట చుట్టఁ
జేతఁబట్ట నాపుణ్యంబు చెప్పఁదరమె.
క. చేతులకాసులు పోయెను
నేతీరున నగ్గిఁ బెత్తు నెవరి నడుగుదుఁ
గ్రోఁతలఁ బెట్టకమునుపే
పోతివిగా నోరునెట్టి పొగయొలచిట్టీ.
మ. మగవాఁడైజనియించినప్పుడె మదోన్మత్తక్రియాధీరుఁడై
పొగయాకుం బొగచిట్టి కాలు నెపుడుం బొంకంబునా క్రోవిచే
సొగసు ల్మీఱఁగ వీధివీధిని జనుల్చూడంగ నేర్పొద్దుఁ దాఁ
బొగఁద్రాగన్ వలె లేనివానిబ్రతు కీభూమిన్ వృథా చెప్పితిన్.
క. పొగ త్రాగి సోలి కాముని
జగడంబున మోహనాంగి సరసన్ మరియున్
దగ వ్రాలి తేనె గ్రోలని
మగవాని దదేటిబ్రతుకు మహి నూహింపన్.

సీ. ధరణీజనులకెల్ల:-సురగింజమాధవుం
డిది సత్యమని కరం బెసయఁ జూపె
ఈసత్యదశవృక్ష మిట గలదంచును
శేషాచలేశుండు క్షితిని జూపె
ఈసత్యదశవృక్ష మింతయెత్తంచును
ఘువజగన్నాథుండు కటిని జూపె
ఈసత్యదశ నది యింతవెడల్పంచు
వినతబిడ్డఁడు కరం బెనఁగియుఁ జూపె
గీ. దేవతావళి వర్ణించి తెలుపునట్టి
యిట్టిమహిమంబు గలదని యెన్నలేని
యొఱుక లేక నిందించెవ లేను యనుచుఁ
తెలఁగి వీరాంజనేయుండు చేయియెత్తె.

## రంగులపద్యాలు.

సీ. పార్వతీపతి తెల్పు పాలసముద్రము తెల్పు
కామధేనువు తెల్పు కంచు తెల్పు
నారదముని తెల్పు శారదాభ్రము తెల్పు
శారదాంబిక తెల్పు సంకు తెల్పు
ఐరావతంబు తెల్పమృతపూరము తెల్పు
ఆదిశేషుఁడు తెల్పు హంస తెల్పు
కల్పవృక్షము తెల్పు కైలాసగిరి తెల్పు
మల్లెపూవులు తెల్పు మంచు తెల్పు
గీ. తెలుపుచెప్పనేల వెలఁదికి మేలైన
గుణముగల్గెనేని కోటిసేయు.

సీ. ఇంద్రనీలము నలు పింద్రానుజుఁడు నల్పు
యమునానదియు నల్పుయముఁడు నల్పు
సామజంబులు నల్పు రామచంద్రుఁడు నల్పు
రతివల్లభుఁడు నల్పు రాత్రి నల్పు
ఆకాశ మదినల్పు హరునికంఠము నల్పు
తుమ్మెదల్ నల్పు కస్తూరి నల్పు
నీరజాక్షులకొప్పు నెఱివెండ్రుకలు నల్పు
బలరామదేవునివలువ నల్పు
గీ. నలుపు చెప్ప నేల నాతికి మేలైన
గుణము గల్గె నేని కోటిసేయు.

సీ. అరుణోదయం బెఱు పరుణాచలం బెఱు
పర్కమండల మెఱు పగ్ని యెఱుపు
బ్రహ్మదేవుం డెఱ్పు బంధూకకుసుమ మెఱ్పు
పద్మరాగం బెఱ్పు పద్మ మెఱుపు
మంకెనపూ వెఱ్పు మణిదొండపం డెఱ్పు
నింద్రగోపం బెఱు పింద్రుఁ డెఱుపు
పసిడంపుఁదీ గెఱ్పు జవరాలిమో వెఱ్పు
కుందనం బడియెఱ్పు కుంకు మెఱ్పు
గీ. ఎఱుపుచేప్ప నేల యింతికి మేలైన
గుణము గల్గెనేని కోటిసేయు.

సీ. శ్రీతరుణీవిభుపీతాంబరము పచ్చ
కమలమిత్రునితురంగంబు పచ్చ
దేవతాచార్యునిదేహకాంతులు పచ్చ
పరిపక్వజంబీరఫలము పచ్చ
పదియాఱువన్నెలబంగార మది పచ్చ

... ... ...

తంగేడుపువ్వుపచ్చ తమ్మి యాకరు పచ్చ
చాలఁ జూపినయట్టి చేల పచ్చ
గీ. పచ్చ చెప్ప నేల పడఁతికి మేలైన
గుణము గల్గె నేని కోటి సేయు.

[పైపద్యములందు గీతి కర్థమేమో, కడపటి రెండు పాదములు తెలియలేదు. వీనిఁగూర్చి యాభాణక మేదో కలదట]

గాలివాన.

సీ. శ్రీరామ నీపాదసేవామృతంబుగా
సీసమాలిక యొండు చెప్పినాఁడ
జగతిలో నుత్పాతజంఝామారుతంబు
విసరినవిధ మెల్ల విన్నవింతు
రుద్రసంబంధియౌ రౌద్రిసంవత్సర
కార్తికశుద్ధ యేకాదశితిథి
వీపార స్వాతిమూఁడో పాదమందున
వాయవ్యమున గాలివాన విసరె
చిటపాటచినుకులు చెలఁగి యడన మారొ
ఘనమేఘములు మింటఁగప్పి నిలిచె
ప్రళయసముద్భూతభయదజంఝానిల
మవని గంపింపంగ నడరసాఁగె
మేడలు గోపురాల్ మిద్దెలు కోటలు
నేలపైఁ గూలెను నీళ్లఁ గలసె
పశువులు మృగములు పక్షిజాలంబులు
నెల్లభూములయందుఁ నొల్లలయ్యె
అష్టదిగ్గజములు నట్టిట్టు తిరిగెను
గడుశేషునకు శిరఃకంప మొదవె

రవిసోమమండలరథములు గతిదప్పె
నక్షత్రములు పూర్వపక్షమయ్యె
జీవులు దూడలు నంభారవములతోఁ
జెట్లను గట్లను జేరఁబడిరె
అన్నలు తమ్ములు నతివలు పురుషులు
కొడుకులు కోడండ్రు గురుజనంబు
తల్లులు బిడ్డలు తగఁ గౌగిలించుక
చలిచేత్త నలసట చాలఁ బడిరి
బంటరు బాపట్ల పరగ నిజాంపట్న
గ్రామముల్ జలధిలోఁ గలసిపోయె
పాలేరు మూచేరు ప్రబలించి కొన్నూళ్లు
వరదను గడువడి వార్ధిఁ జేర
అద్దంకివినుకొండ యాప్రాంతములయూళ్లు
గుండ్లకమ్మను బడి కూలిపోయె
కంచనూ లాదోని గండిగోటయు గుత్తి
కడప సిద్ధోటముల్ కలవరించె
నల్లమలంతయు హల్లకల్లోలమై
కూఁకటిప్రేళ్లతోఁ గూలె ధరను
వెలిగొండవృక్షాలు వెల్లిపా లయ్యెను
పొడిలెకొండను గుండ్లు పొర్లిపడిరె
చినకుర్తికొండయు ఛిన్నభిన్నంబయ్యెఁ
గొండెవీ డెంతయు బెండుపడిరె
సిరిగిరిమల్లయ్య చెక్కుటఁ జేయిచేర్చె
భ్రమరాంబ చింతచేఁ బవ్వళించె
వేంకటాచలపతి విపరీత మనిపల్కె
నలమేలుమంగమ్మ యడలసాగె

ప్రథకెక్కు దేవళ్లు పరితాపపడఁ జూచి
యమ్మాళ్లదేవళ్లెల్ల వెళ్లఁ బడిరి
ఎసఁగొని విషవాయు వీశాన్యమునఁ బుట్టెఁ
బైరులు పంటలు పాడుపడియె
పాఁతళ్లధాన్యముల్ నూతులవిధమాయెఁ
గలవర్తకులకోర్కి ఘనతగాంచె
కలువుదీతినవెన్కఁ గడువేడ్క భూమికి
నెలమూఁడు వానలు నిండికురిసె
వెండుగా దండిగాఁ బండెను బంటలు
వరపోకుఁ బుట్టేఁడు వసుధ నమ్మ
అంతట్టు భూజను లానందమందిరి
సర్వత్ర సౌఖ్యముల్ సంఘటిల్లె
గీ. ఆహాహా నీమాయ యేమనియభినుతింతు
భాసిఁగ నీపాదమునఁ బుట్టి పుడమి ముంచె
మేలుగా నాల ముంచెఁ బాతాళగంగ
నెమలిగుండము శ్రీరంగ.నిర్మలాంగ!

ఖేచరములు.

సీ. కలహంస కోయిల కనకాక్షి కాకియు
కాఁజు కొక్కెర కొంగ కారుకోడి
కాకి బెళ్వాయి మఱి కనుపెంటి కంకణం
కణిశిరి నల్లేరు కత్తిపిట్ట
కణుదుదు కలకలం కావేరుగాడును
కనకపక్షికరంజికలుకజీఱ
గరుడఁడుగిజిగాడుఁ గరుడజీనుగసువ్వ
గుడ్లగూడునుగోయవంక
గద్దిగాడును గద్ద గండభేరుండంబు
గోఱవంక కనుమింటు గూడపులుగు

గడ్డంగి గొగ్గడి గగ్గు గజ్జలపిట్ట
గొల్లకోవెలగువ్వగుబ్బపిట్ట
గరిడి గుబిలిగాడు గజ్జిబోడయు ఖండ
చక్రవాకిచిలుక చాకిమోపి
చిటిబెళ్వచెందోవ చింతచకోరంబు
చిత్తుపచికబిందు చిందవగ్గు
సరసచిరాయువు జఘుడుకాకియుచిల్వ
చింత నిప్పరికాడు చెఱకుపిట్ట
ఒట్టెచంచ చిటీల లకుముకిచి......
చడలుకోడియుచార్ల చంగగాడి
చీకును చిటిగద్ద చిత్రాంగిమఱియును
చల్లపిడతనూర్ల సాలెగాడు
జగుజటాయువు జగ్గుజవపిట్ట లావుక
జెలగెటి జలకట్టె జిబ్బటాయి
జాలెడేగను పెట్ట జావడంబనుపక్కి
జిక్కియుజాటుపిట్ట జిఱ్ఱగడ్డ
డబ్బుడాసరిగాడు డాగుడాగులపిట్ట
తంగెడుబండారు తఱుకుతిరువు
తెల్లయేకులనారి తెల్లచిల్కతురంగి
తుంతపిక్కిలితూరి తూనెగాడు
దోగడి దోరువ దొంతరంబుతురాయి

... ... ...

నీరుకోడియునేల నెమలియ్యు నమ్మలియు
మచ్చికాడు మరాళిమబ్బుజీడ
మడిరొబ్బె మడియాలి మబ్బుకాడి ముసుంగు
నెరకాళిపిట్టయు నెన్నడాయి

రొంగుబోడ యిల్లాయి యిలకత్తి యిట్టిరె
ఆసకప్పరకాడు ఆకుముక్కు
ఆడేలుతావలి హస్తిపిట్టయుమేటి
రమ్యమై విలసిల్లు లగుడులిక్కు
వానకోవెలయును వారణముల్లంగి
పూసుగిత్తరిగాడు వోయగోరికె
వనభోజనమువగ్గు వగ్గోలు వదనిక
వసపిట్ట వసపుల్క వన్నెలాడ
వంగపండును వక్క వనజీపిపయువారి
సంకుబెన్నంగియు స్వాతికోంగ
సమ్మాళి రణగద్ద సరసరామయుచెల్వ
పరగిగోడియు మతిబహుళలీల

గీ. సకలగిరిదుర్గములయందుఁ బ్రకటముగను
పక్షిజాతంబు లీరీతి బహువిధముల
నుండు నేవేళఁ దందోపతండములుగ

## భూచరములు.

సీ. శరభంబు నేనుఁగు శాఖామృగంబును
మనుబోతు దుప్పియు మానుబిల్లి
కారొప్పెతు నెనుమును కణితిమృగంబును
సరసచతుర్దంతి చమరిమృగము
ఖడ్గమృగంబును కస్తూరిమృగమును
గురుపోతు గొఱియయుఁ గొండగొఱియ
జల్లిపోతుముసలి జవ్వాజిపిల్లియు
పునుఁగుఁబిల్లి యొలుంక పొసఁగలేడి
జింక కొర్ణయు నేచు చిరతలపందియు
గండకంబును నిట్టికత్తిగాడక

గుఱ్ఱము తోడేలు కుందేలు గురుబోతు
కొంక నక్కయు మెడగోవు వుడుము
బెబ్బులి యుడుతయు బెట్టుపు నక్కయు
కంచిమేఁక గోఱియ కాఱుఎనుము
జీనుపంది బెసిడి సివ్వంగి కోఁతియు
నలరభద్రమృగంబునాశునంబు
జెగిలిపోతమ్మిడి వేసడ్డంబు మఱియు
పంది పరంగియు పండికొక్కు
జగ్గుబిల్లిముసువు చన్నంగినక్కయు
రుద్రాక్షమృగమును లొట్టి పిట్ట
మచ్చంగితాబేలు ముంగి కుక్క పరడు
గరిమెడికొక్కును గార్దభంబు
తొండయునలికిరి చుండెల్కదున్నైన
మండయుగరిడియు మఱియుబల్లి

గీ. ఆదిగాగల భూచరాలతి శయిల్లు

## జలచరములు.

సీ. తిమియు వాలుగలంబ తిరికియుసెత్తాము
పొసఁగఁజారగుడెయు బొమ్మిడాయి
మీఁసపచందాము మలుగుమీనును చాఱ
మచ్చంగి కాంభోజమొల్లమీను
కనుగు చిత్రపుమీను కారు మీనును గచ్చ
తేలుమీనును మొయ్య తేకుగండె
మారకండె గొరక మట్టగుడిసెబెళుకు
పాఱాయి పాపర పండుమీను
నాఁపరు బొజ్జయు వల్లెక తట్టయు
వుల్లాముజేడిసవులసచేప

కోలువాసముగ్రాయ్య కొజ్జమీనును దొమ్మ
నారజల్లయు మోరనట్టు పక్కి-
ములుమొమ్మ డాయియు ముసుకును దూవెను
పందిబోరయు పళ్కుపారమీను
పెద్దజల్లెయుఁబక్కె పెనుచేపమంగళం
కన్నెమీన్కుదురును కాకి గండె
కొనచారకోపెయు కూనరొయ్య మెడుపు
యెగుమీను మతి పచ్చ యెఱుపుచేప
రాతికోకయు చోఅరాణంగి మిణుగురు
యిల్లాయిపూమేను నిసుక దొందు
ముక్కుచేపయుకోలు కక్కుపల్కె సెలుసు
ఆకుజల్లవరుజానణుజుమీను
కుచ్చుపి త్తలికాసు కుంటముక్కును తిక్క-
చేపలాదిగఁగల్గు జలచరములు.

శ్రీచెన్నరాయాధిపా.

శా. ఏకాంతంబున నీవు నేను మదిలో నింపైనమార్గంబునన్
జోకన్ గూడినముద్దులెల్లఁ దలఁపన్ జోద్యంబు లైయుండురా
నీకు న్నన్నెడఁబాయ న్యాయమటరా! నీ కింత కంటేలరా
చేకోరా చల మేల? మారకపురీ శ్రీచెన్నరాయాధిపా!

శా. పోరా దగ్గఱ రాకురా నగకురా పూబంతి నే నొల్లరా
కోరా దుండమేలరా విడువరా కొంగేలఁ బట్టేవురా
యేరా న్యాయము కాదురా తొలఁగరా యిల్లాండ్ర నీరీతిగాఁ
జేరన్ జెల్లదు నీకు మారకపురీ శ్రీచెన్నరాయాధిపా!.

శా. నీవు న్నేనును దూఁగుటుయ్యాలలపై నిద్రింపఁగా నెవ్వతో
నీవంచు న్ననుఁ లేపి ముద్దుఁగొనెరా నీపేరనే పిల్చెరా
ఆవేళ వ్వా డదేలవచ్చెఁ జెపురా ఆయింతి పేరేమిరా
శ్రీవైకుంఠనివాస! మారకపురీ శ్రీచెన్నరాయాధిపా!

శా. పలుకుంజిల్కలపట్టెమంచములపై బాగైనపూఁబాన్పుపై
జెలువొందన్ బవళించి నాతొడలపై శ్రీపాదము ల్చాఁపఁగాఁ
గలిగేనా యిఁక నొక్కనాఁటికయినన్ గంజాక్షు! సంభోగముల్
జలుగు న్వెన్నెలబైట మారకపురీ శ్రీచెన్నరాయాధిపా!

శా. పసుకం బగ్గల మాయెరా వలదురా శాపంబు నెట్లోర్తురా
నిముసంబైనను నిన్నుఁ బాసి యిచటన్ నే నెట్లు వేగింతురా
మమతన్ బిల్చినఁ బల్కవేమిటికిరా మన్నించరా కౌఁగిటన్
చెమటల్ జాఱఁగఁ గృష్ణ మారకపురీ శ్రీచెన్నరాయాధిపా!

శా. ఎంతైనన్ విలపింప నేఁచఁదగునా? యేరా నినున్ బాయరా
కొంతైనన్ దయయుంచి యేలఁగదరా కోపంబుఁ జాలింపరా
కంతుం డమ్ముల నేసెరా నిలువరా నాకేల చేసెవురా
చింతంబెట్టక రార మారకపురీ శ్రీచెన్నరాయాధిపా!

శా. ఏనారీమణియింటనుండితివిరా యిందాఁక రావేమిరా
నానేరం బొకమైనఁ గాను మనుచున్ నా కేల మ్రొక్కెవురా
కానీ యిందుల కేమి తాళుకొనరా గర్వింపఁగా నేలరా
శ్రీనారాయణ కృష్ణ మారకపురీ శ్రీచెన్నరాయాధిపా!

శా. ఏరా నామన వాలకింపఁగదరా యేమంటి రమ్మంటిరా
రారా కస్తురివీడె మందుకొనరా రంజిల్లఁగా జేయరా
కోరా బంగరుబంతు లందుకొనరా కోపంబుఁ జాలింపరా
శ్రీరామా యిఁక నన్ను నేలుకొనరా శ్రీచెన్నరాయాధిపా!

శా. ప్రాపుం డా పని నమ్మియుంటిఁగదరా పంతంబుఁ జాలింపరా
యేప్రొద్దుం దలపోఁత లాయెఁ గదరా యీమారుతాపాలచే
నాపుల్ కట్టుకు లోనునైతిఁ గదరా రాకున్న నెట్లోర్తురా
శ్రీపాదంబులసేవఁ జేతుఁగదరా శ్రీచెన్నరాయాధిపా!

శా. నీకన్నన్ మెఱజాణ లేదుగదరా నీయాన నన్ బ్రోవరా
యేకాంతంబున బుజ్జగింతుఁ గదరా యీవేళ నన్నేలరా
నాకు న్నీకును నొక్కయీడు గదరా నాముచ్చటల్ దీర్చరా
శ్రీకాంతాప్రియ నన్ను నేలుకొనరా శ్రీచెన్నరాయాధిపా!

శా. చెంతన్ జేర వదేమిరా తగదురా చేపట్టి నన్నేలరా
యెంతైనన్ నినుఁ బాయలేనుగదరా యిందేమిచోద్యంబురా
కంతుం డేయఁ దొడంగెరా కటకటా కాకేల చేసేవురా
చింతల్ మానిపి నన్ను నేలుకొనరా శ్రీచెన్నరాయాధిపా!

## భ్రమరాంబామల్లీశ్వరసంవాదము.

శివాలయములలో నీపద్యముల నుత్సవవిగ్రహములకుఁ బవ్వళింపు సేవ వేళ ద్వారముములోన నొకరు వెలినొకరు నుండి చెలుసగముగా నీపద్యములఁ బాడుదురు.

శా. శ్రీమద్భూమిధరాధిరాజతనయా శృంగారగాత్రోజ్జ్వలా
నామీఁదన్ దయలేక నీవును వృథా నన్నేల వీక్షింపవే:—
ప్రేమన్ వేఁట నెపంబునం జని పరస్త్రీఁ గూడినా విప్పుడున్
శ్రీమించన్ నను గూడ నేల పదరా శ్రీశైలమల్లీశ్వరా!

శా. భామారత్నమ! యెవ్వతో మఱుఁగుగాఁ బాటించి చెప్పంగఁబో
నేమైనన్ గుఱు తిందుకుం గలదె? యీసందియంబేలనే!—
యీమోదంబున నీవు వచ్చినవిధం బాతీరు గన్పించెరా
శ్రీమించన్ గురు లేటికిం జెవరెరా శ్రీశైలమల్లీశ్వరా

మ. మృగసందోహము వెంబడిన్ బొడల దూరేపోవఁగాఁ గొమ్మలన్
దగులంగాఁ గురు లన్నియుం జెదరెనే తథ్యంబుగాఁ జూడవే:—
మిగులం బొంకితి విందుకుం జతురతన్ నీమోవిపై నేటికిన్
జిగిమించం బలు బలుగెంపు లెక్కడివిరా శ్రీశైలమల్లీశ్వరా.

మ. చిలుకం దెచ్చిన ముద్దు సేయుతతిఁ జూచెం బింబభావంబునన్
జెలియా గ్రక్కున స్వాదు మోవిఁ గఱచెన్ సిద్ధంబుగాఁ జూడవే:—
బళిరా! నేర్పునబొంకిచెప్పితివిగా బాగాయె నీకోకలన్
జిలిమించన్ బస పేటి కంటెఁ జెపురా శ్రీశైలమల్లీశ్వరా!

మ. వరపద్మాకరమధ్యమస్థలములన్ వర్తింపఁ బద్మంబులం
దొరయన్ గోఁకలనంటెఁ బుప్పొడులివే యొచ్చెంబు చేసేవటే:—
సరసత్వంబున బొంకి చెపితివి నీస్వాభావమే చెక్కులన్
స్థిరపీటీరస మేటి కంటెఁ జెపురా శ్రీశైలమల్లీశ్వరా.

శా. సింగం బున్నగుహాంతముల్ వెదకనోఁ జేగర్లపై డిగ్గచుం
డంగం జెక్కుల జేసరంబె నెఱయన్ స్వాతిగ్గొంత్రనా!—
అంగీకారముచేసికొంటి వది నీయంగంబుపైఁ గ్రొన్నెలల్
సింగారించినభాసుపేరు చెపురా శ్రీశైలమల్లీశ్వరా!

మ. తరుణీరత్నమ! శేగ వీవ్వడి. మహాపర్వంబునం బోవఁగాఁ
జిరుగం బట్టఁగ జేగగోరులు పయిన్ దీర్ఘంబుగా నాఁటెనే :—
సరవి స్తన్నిటి కన్ని బొంకితివిగా సర్వజ్ఞ నీకిచ్చులన్
సిరిమించ న్నెలు పేటికంటెఁ జెపురా శ్రీశైలమల్లీశ్వరా!

శా. వేమాఱున్ నను నేరముల్ పలుకఁగా ప్రేమాంతరంగుండ నై
నీమీఁదన్ గతినోగ్రదృష్టి నిలుపన్ నేత్రం[illegible]గాయె నే
నీమాటే యొకటైన సత్యమటరా నే విశ్వసించం జుమీ
శ్రీమత్కాంచన శైలకార్ముకధరా! శ్రీశైలమల్లీశ్వరా!

శా. ఏమింజెప్పిన నమ్మఁజాలవుకదే యీప్రొద్దు సన్నేఁచకే
పాముం దెచ్చెదఁ బట్టెదన్ విసపు నీపంతంబు లీడేరఁగాఁ
బామే సొమ్ముగఁ జేసినావుగదరా కష్టేది నీకెంతరా
శ్రీమద్భూధరరాజకార్ముకధరా శ్రీశైలమల్లీశ్వరా.

వ. అది గాకున్నను బాసచేసెదను నీ పాదైన నమ్మన్గదే
తుది నాజిహ్వను మడ్డు దాల్చెద నిజే యుచ్చంబుగాఁ జూడకే:-
అది నీకెంతయుఁ గాఁ త్రేఁకాలగరళం బన్నంబుగాఁ జేయఁగా
త్రిదశేంద్రాచ్యుత పూజితాంఘ్రికమలా శ్రీశైలమల్లీశ్వరా!

మ. చెలియా! యేమనివిన్నవించిన మదిన్ జేపట్టవింతైన నా
వలన న్నేరము లెన్నియుం గలిగినన్ వామాక్షి కావంగదే
పలుమా రిట్టు హశామాళుల్ పలుకఁగాఁ బాండిత్యమా వారిని
చెలువం బిక్కడఁ జూపవచ్చితటరా! శ్రీశైలమల్లీశ్వరా.

శా. ఏమే! పూర్ణశశాంకబింబవదనా యేమే జగన్మోహినీ
నీమీఁదాన మఱెక్కడన్ నినువినా నేనెక్కడన్ జొక్కనే
నామీఁదం గరుణించి యేలఁగదవే నన్నుం గటాక్షింపవే
శ్రీమించన్ భ్రమరాంబికా గుణమణీ త్రైలోకచూడామణీ!

## శృంగారము.

ఉ. ఏడెము తెత్తునో పసిఁడివీణియ మీటుచుఁ బ్రొద్దుపుత్తునో
కూడినకుంకుమంబు చనుగుబ్బలకొత్తుగఁ గౌఁగిలింతునో
వేడుకఁ జంద్రకాంత మయవేదికమీఁదికిఁ బండవత్తునో
యూడిగ మేమిరా యనుచు నూఱట పుత్తుగదే కళావతీ!

శా. ఆమన్వెంపు ట నంటిపొన్నగుమిలో నామూలపూఁదోఁటలో
నామాణిక్య పురత్నమందిరములో నాతూఁగుటుయ్యాలపై
మెమై నిద్దఱ మొక్కనాఁడు సుఖ సామ్రాజ్యంబు పాలించుటల్
స్వామే సాక్షిగ నెన్నఁడున్ దలఁతు నాలాయంబు బింబాధరా!

ఉ. నాఁడొకనాఁడు నిన్ను నెలనాఁగరొ చూచిననాఁటనుండియున్
వేడుకపుట్టి మన్మథుఁడు వేదసేయఁగ నోర్వలేక నీ
వాడకు వచ్చిచూడఁదలవాకిటరాఁ జెటు తొంగిచూచినన్
కాఁడినచేని మీఁదికినివానలు వచ్చునటే కళావతీ!

చ. సరసిజనేత్ర! యోవికులచంద్రనిభానన! రాజహంసి! యో
హరునిశరంబ! పుష్పలత! మానిని! రత్నము! కీరవాణి! యే
విరహముచేతఁ జిక్కికడు వేదనఁ బొందితిఁ గౌఁగిలింపవే
శరణుశరణ్యమే మెఱుఁగుఁ జక్కనిచెక్కులముద్దులేఁగదే.

శ్రీనాథుఁడు పద్మసాలెమిటారిపైఁ జెప్పినపద్యము.

సీ. పడుగేచోఁ జూచుఁగుడియెడమల యందు
సంచరించెడివిట సముదయములఁ
బోగులు గట్టుచో బొరుగిండ్లచిన్నప్రా
యపుటింతులకు నుపాయములు గఱపుఁ
గండెలుచుట్టుచోఁ గన్బొమసైఁగతో
సొగసుకాండ్రకుఁ దెంకిచోటుఁజూపు
అచ్చువేయదుకుచో హాస్యరసంబుఁ
జెలికత్తెలను మాఱుపలుకరించు
గీ. నావలీవలి సతులతో హాస్యమాడు
మోఁకుబిగియించుచోఁ బతిమోసపుచ్చుఁ
గుంచెపిడి పట్టియాడ్చుచుఁ గోమరు ముగులఁ
బద్మసాలెది వగఁదేఱి బలుమిటారి!

జంగమురాలిమీఁదఁ జెప్పినది.

క. చెవినివి నీలపురాలా
యువిదరో నిను రతులఁదనుప నొకనితరాలా
యివి రుద్రాక్షసరాలా
జవరాల మహాత్మురాల జంగమురాలా!

మఱికొన్ని.

సీ. శృంగారజలధిరా బంగారుబొమ్మరా
సంగీతలోలరా సరసిజాక్షి
అరవిందపాణిరా యళికులవేణిరా
కోకిలవాణిరా కోమలాంగి
కలియుగరంభరా కరిరాజగమనరా
నటనప్రవీణరా కుటిలకేశి
కలికిరాచిలుకరా కమ్మపూమొలకరా
యిందుబింబాస్యరా కుందరదన
గీ. చిగురుకంచెలచెలిగూడఁ బ్రేమతోడ
భోగసామ్రాజ్యమునఁ దేల వరాదేల
చారుతరమూర్తి! దేవతాచక్రవర్తి
రమ్యగుణధామ! కావేటిరంగధామ;
సీ. వీణె చక్కఁగఁబట్టి వింతగా రాగంబు
వాయింప నేర్చిన వనితగాదు
సంగీతసాహిత్య సరసవిద్యలచేత
మెప్పింప నేర్చిన మెలుతకాదు
ఆటపాటలచేత నభినయంబులచేతఁ
గరఁగింప నేర్చిన కాంతగాదు
సనిచక్కఁగాఁజిక్కి కసుగందకుండంగ
రహిఁగొల్ప నేర్చిన రమణిగాదు
గీ. ఏమివగ మెచ్చితో చాలు నింకనీవు
తలఁగిరావయ్య యీజాణతనముమాని
రత్నములమాల సిరికోట రాజాపేట
బాలగోపాల! రాధికాప్రాణలోల!

క. సతి కైదుముళ్లు గల పట
పతి విప్పును రెండుముళ్లు బలవంతమునన్
హితమున నొకముడి వీడును
తతిఁ దక్కినరెండుముళ్లు తామే వీడున్.

గీ. త్రిమ్మరీఁ డొక్కబంగారునిమ్మపండు
కేలఁ గీలించి మెల్లనె గిల్లిచూప
మేడపైనున్నచిత్తరు,గోడమీఁద
ప్రొద్దుపై వారిజాతాక్షి బొట్టుపాడిచె.

చిత్రపశ్నోత్తర పద్యములు.

క. ఎద్దిశున కర్వంబగు
గ్రద్దన నేదడవిఁ దిరుగు ఖరకంటకిరౌ
హద్దుగ నేవాఁడుఘనుఁడు
పద్దుగ నుత్తరము లింటె పడయంగా నా.

గీ. ఘూథనికరమేదురమును జూచి మెచ్చు
శ్రహిఁ గలుపయలశేఱని రాకఁ గోరు
బూవు లేమా విగున్నకుఁ బొజెమకుండు
నరయ నుత్తరములు నింటె యమరియుండు.

గీ. దాన మేదానియందగుఁ దలఁచిచూడ
జారుఁ డేకాంతకాంతాప్తిఁ గోరుచుండు
గాంత యేరాఁత్రితోఁ గడుఁ గయ్యమాడు
నరయ నుత్తరములు నింటె యమరియుండు.

గీ. పుడమిఁ బగఱనిఁ జెండాడిపొల్లుపుగాంత్రు
కన్నఁగ నేమియుండును బలడికంటికొనను
జనము లేమికోరంగను జాలకుండు
రరయ నుత్తరములు నింటె యమరియుండు.

## కలగలుపుపద్యాలు.

నైజామురాష్ట్రమున నొకయగ్రహారికుఁడు తమయగ్రహారప్రస్థితిగతుల ను దురకసంస్కృతాంధ్రములతో శ్లోకముచెప్పి ప్రభువునకు నివేదించినాఁడట!

శ్లో. ఫలంలేదు మజ్కూర్ కలంబందు హాల్‌సాల్
అలం మోదుగాకుల్ క్వచిత్ చేకుమాకుల్
అవుర్ కోయకొంపల్ మరీ మాలకొంపల్
హరయే ముళ్లకంపల్ హమారే గ్రహారే!

శ్లో. తుమారాజవానుల్ హమారేగ్రహారే
కదాపీహదంగా సజాసేయకుండజ్ఞ।
హుకుం దీయతాం నో హకాంచాపి పద్యా
త్ఖుదాతే ముదే స్తా త్సదా జంగలీశ!

ఇట్టి దిట్టఁడే వేఱొక్కఁడు:—

శ్లో. తిండి కైతె పదిమంది వసంతి
తండులాలు గృహమందు నసంతి
కుండబొచ్చెలు పరం విలసంతి
కండనాకొడుకు లెల్ల హసంతి.

## రామాయణచాటువులు

సీ. శ్రీమత్సకల గుణశ్రేయోర్థ సంపన్ను
లయిన శ్రీరాజ్యాభ్యుదయసమృద్ధి
మన్మహామేరుసమానధీరు లయిన
దశరథేశ్వరులకుఁ దాల్మితోడ
జనకమహారాజు సాష్టాంగములు చేసి
వేడ్కఁ జేయంగలవిన్నపములు—:
ఇక్కడ శుభమువిూరొక్క సంతోషంబు
వ్రాయించిపంపించవలయు నుండి

తరువాత:—శ్రీరామధాత్రీశునకుఁ జైత్ర
శుద్ధపంచమినాఁడు సొంపుమీఱ
మాపటిలగ్నాన మాపట్టిసౌభాగ్య
వతి సీత నిచ్చి వివాహమహము
ఇక్కడ మిథిలలోనే చేయఁబెద్దలు
నిశ్చయించిరి గాన నిందు వేడ్క

గీ. సహకుటుంబము పరివారసహితముగను
విభవమున వచ్చి మీర లీ శుభముహూర్త
మెలమిఁ జేయించి ప్రమదంబుకొలుపవలయు
వెలయఁగా నివె పదివేలవిన్నపములు.

సీ. ఎవరయా మీరు చక్కని [?] రాజు బిడ్డలు
సర్కవంశ్యుల మయోధ్యాపురంబు
మీపేరు లెవరయా? ఓపుణ్యనిధులార
రాఘవుం డతఁడు నే లక్ష్మణుండ
దండంబుదండంబు దశరథసుతులార
వర్ధిల్లు వర్ధిల్లు వానరేంద్ర
ఎందు వేంచేస్తిరో యినకులోత్తములార
యిచ్చోటఁ గార్యంబు నెఱుఁగవస్తి

గీ. వాయుపుత్త్రుండ హనుమను వచ్చినాను
భానుపుత్త్రుండు సుగ్రీవు బంటు నేను
చెలిమిమీకును మీకును జేయఁగాను
అతఁడు మీరున్నచోటికి సంపగాను.

భారతకథ

సీ. గర్వితద్విట్క్రౌంచ గాంగేయు గాంగే
ఘనవైరిభేకదృక్కర్ణుఁ గర్ణు

నిష్ఠురశాత్రవానీకనిష్కృపుఁ గృపుఁ
త్రుటితారి తనుకృతద్రోణు ద్రోణు
భయాతహితారాతి భయదత్తు భగదత్తుఁ
జండపరామిష శకుని శకుని
లక్షజితేంద్రజిల్లక్షణు లక్షణు
సకుటిలరిపుమనశ్శల్యు శల్యు

గీ. అహితధూమకేతు నహికేతు నాత్మీయ
విశిఖవృష్టిచేత బెగడుపఱిచి
పసులఁ గ్రమ్మఱించెఁ బ్రతిభసహస్రబా
హార్జునుండునైన యర్జునుండు.

సీ. ఖండితవైరి శిఖండి ఖండించెను
రిపుజీవజీవనగ్రీష్ము భీష్ము
పాంచాలతనయుండు మించిమర్దించెను
శత్రుపురాసురస్థాణు ద్రోణు
చండమదోద్వృత్తిఁ జెండాడె గాండీవి
పరరాజసర్పసుపర్ణుఁ గర్ణు
విమతాగహారిహేతి యమసూతి శిక్షించె
సమదరాజన్యదృక్శల్యు శల్యు

గీ. పొడిచి గెల్చిరి మాద్రేయు లడరికదిసి
సమదగర్విత శత్రునాశకుని శకుని
భీమబలుఁడైన భీముఁడు పీఁచమడఁచె
రాజ్యబలగర్వితుల ధృతరాష్ట్రసుతుల.

శా. ఎట్టా శేషుఁడు పోసరించె సభ నిన్నెగ్గాడఁగా రత్న మీ
డట్టా వాసుకితక్షకాహి ధృతరాష్ట్రి మాత్యకర్కోటకుల్

చంద్రటా నిల్తురు గాక నిన్ను సముత్క్షోణిక్ విజృంభించి యా
గ్రటామాలివిభుండై దర్పిన నహంకారంబు వారించెదక్.

## భాగవత చాటువులు.

సీ. భావింపదేవకీదేవిమాయ త్తమ్మ
మామామవసుదేవ మాన్యుఁడమ్మ!
బలభద్రమూర్తి మాబావ గావలెనమ్మ
కొమ్మరేవతి తోడికోడలమ్మ
సకియరుక్మిణి మాకు సవతియేర్పడెనమ్మ
తగఁబంచశరుఁడె మాతనయుఁడమ్మ
మగువరో సాత్యకి మఱది గావలెనమ్మ
యలసుభద్రయు మాకు నాఁడుబిడ్డ
గీ. ఇంద అన్నాఱు నున్నందుకేమి ఫలము?
కలిమిబలఁగము సకలభోగ్యములు గలవు;
ఎన్నియున్నను నింతుల కెందుకమ్మ?
ప్రాణనాథుండు త న్నెడఁబాయుచున్న!
సీ. నల్లనికస్తూరి నామంబుక్రిందను
దిలకంబు కొనగోర దిద్దినాఁడు
రంగైనపదివన్నె బంగారుతాయెతుల్
పట్టువస్త్రాల సిగం జుట్టినాఁడు
మెఱుఁగుదేరెడి నీలమేఘవర్ణపు మేన
మంచిగంధ మలంకరించినాఁడు
ఘననవరత్నసంఘటిత మైవెలిఁగెడు
కడియముల్ సందిటఁగట్టినాఁడు
గీ. తొడరి దంతపుఁ బావలు తొడిగినాఁడు
వెలఁది చెంగల్వ పూదండ వేసినాఁడు

[రాయలు కోపింపఁగా రామాయణకథాది పరముగా మరలఁ జెప్పెనట.

క. అర్భకులు లేక యాజియు
దర్భలశయనమునఁ బండి తపసివసిష్ఠున్
నిర్భయతవేఁడి సుతులకు
గర్భంబగు నట్టి క్రతువు గావించె నొగిన్.

క. అర్భకులు గల్గుటకు సం
దర్భముగా కున్న మదిని దపియించుపతిన్
నిర్భరత వేఁడి యముచే
గర్భముధరియించి కుంతి గాంచెఁగుమారున్.

## తిలకాష్ఠమహిష బంధము.

క. తిలకాష్ఠ మహిషబంధము
ఫలములు భోజ్యములు యజ్ఞపశువుల నేనే
యిలఁగూర్చి కొంటి రాముని
బిలువఁగ వచ్చితిని బంధభీతులఁ బ్రోవన్.

క. వలలుండు ప్రొయ్యిమీఁదను
గలకలమని కాఁగుచుండ గంజికి దింపన్
దిలకాష్ఠమహిషబంధము
సులభతఁ దెమ్మనుచుఁ దోడి సూదునిఁబంపెన్.

ఈ సమస్య యల్లమరాజు సుబ్రహ్మణ్యకవి పూరించినదట.

ఉ. వస్త్రువహార రత్నములు వన్నెనగల్ పులిమీఁద వచ్చునా
పుత్రయాటన్నరీతి జిగిఁ బొల్పగు మాయకళిలఁ జూచుచున్
ధాత్రిల నేల కేలఁ గొని గోరులనొక్కుచు సాధియించుఁ దాఁ
సుత్రరమొనర్చి లేమ తనగుబ్బలయుబ్బు సహింపలేమిచేన్.

విద్యా నభినవరాయ బిరుదాంకితుఁడగు మాడభూషి వేంకటాచార్యకవి పీఠికా పురాధీశ్వరు నాస్థానికి శతావధానము చేయ నరుదేరఁగా "ఇఁక" యని యారంభించి కందపద్యముతోఁ బ్రభుగుణకీర్తనముచేయ నీయన కోరెనట! ఆశువుగా వేంకటాచార్య కవి చెప్పినపద్యము:—

క. ఇఁక నెవ్వరి కీర్తులు నీ
ప్రకటగుణాఢ్యుఁడైన రామరాయక్ష్మాభృ
త్సుకృతి జనపోషకుని కీ
ర్తికి సరిగా రావు సుమ్ము పృథ్వీస్థలిలోన్.

అరసున్న ప్రాసము రాలేదని యాచార్యులుగారి నాక్షేపించి సుబ్రహ్మణ్యకవి యీ క్రింది పద్యమును జెప్పెనట:—

క. ఇఁక విను నీయశమునకుఁ ద
లఁకి శశి కృశుఁడయ్యెను మఱలఁ జెరుఁగ వేల్వ
ల్లఁకియుఁ గొనునో తొలిమలకె
లఁకులను శ్రీరామరాయ లలితశ్రేయా!

సభాపతి.

క. శ్రీరమ్యుఁడు సంతతశ్రృం
గారుఁడు రాజాన్వయప్రకారుఁడు నుతదా
నారూఢుఁడు సకలకళా
పారంగతుఁ డనఁగ నాసభాపతి యొప్పున్.

క. తరుణుండై నరత్నా
భరణుండై గంధపుష్ప పరిమళయుతుఁడై
పరనారీ స్మేరుఁడై
పరగినవాఁ డమరు నాసభాపతియనఁగన్.

క. తనయుల మంత్రుల మిత్రుల
నునిచి సమీపమునఁ దగు నియోగుల విద్వ
జ్జనులను మన్ననఁ గొందఱ
కునుఁ దగు నాసనము లిచ్చి కూర్చుండంగన్.

క. నరపతియై ధనియై సు
స్థిరమతియై సకలవిబుధ సేవితవిద్యా
పరిణతుఁడై చతురుఁడై
పరగినవాఁ డమరు నాసభాపతి యనఁగన్.

క. భావజ్ఞుల రసికుల సం
భావనగలవారి రాయబారులఁ గవులన్
రావించి యథాసనమున
భావనతో నునుపవలె సభాస్థలి నడుమన్.

క. వీరాహవమున విజయియు
ధీరోదారుండు సుగుణతేజోనిధియై
యారయ సింహాసనమున
నారూఢుం డగుచు నొప్పు నాసభ నడుమన్.

వ. ఇట్లు కొలువున్న సభాపతిలక్షణం బెట్టి దనిన బ్రహ్మదేవుని వామ దక్షిణ భుజంబులం బ్రభవించిన సోమసూర్యవంశంబులం దుదితుండై రాజస తామస సాత్త్వికంబులనియెడు గుణత్రయంబు తెలిసి దానధర్మ పరోపకారం బులు సేయుచు స్వర్గ మర్త్య పాతాళంబు లనియెడు లోకత్రయంబు నెఱింగి భూత భవిష్య ద్వర్తమానంబు లనియెడు కాలత్రయంబుచే బ్రహ్మ విష్ణు మహేశ్వరులను మూర్తిత్రయంబు నెఱింగి ప్రభు మంత్రోత్సాహంబులను శక్తిత్రయంబు గలిగి శత్రు మిత్రోదాసీనుల గుఱ్ఱెఱింగి ప్రాహ్ణాపరాహ్ణ మధ్యా హ్నంబులను త్రికాలంబుల వార్చి యాహవనీయ దక్షిణాగ్ని గార్హపత్యంబు

లను త్రేతాగ్నుల ప్రభావంబులం దెలిసి దారేషణ పుత్రేషణ ధనేషణంబులను నీషణత్రయము వర్జించుకాలంబెఱింగి కృత త్రేతా ద్వాపర కలియుగంబులను చతుర్యుగంబుల ధర్మంబు లెఱింగి ధర్మార్థకామమోక్షంబులను చతుర్విధ పురుషార్థంబులం దత్పరుండై, యాన్వీక్షికీ త్రయీవార్తా దండనీతులను విద్యా చతుష్టయంబుం గని ఋగ్యజు స్సామాథర్వణంబులను చతుర్వేదంబులం బ్రసక్తుండై వేదశాస్త్ర పురాణేతిహాసంబులం దాదరంబు గలిగి సామభేద దాన దండంబులను చతురుపాయపరుండై బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ భైక్షుకంబు లనియెడు చతురాశ్రమంబు లరసి రక్షింపుచు రథగజాశ్వ పదాతులను చతురంగబలంబులఁ గలిగి మనోబుద్ధ్యహంకార మమకారంబులను చతుర్విధ తత్త్వ పరిజ్ఞానుండై, క్షౌరాభ్యంగ దంతధావన నిర్మల వస్త్రంబులను నలుతెఱంగుల గఱగఱికలుగలిగి వస్త్రాభరణ గంధపుష్పంబులను చతుర్విధశృంగారవంతుండై, ఉన్మాదన మదన వశీకరణ సంతాపనంబులను చతుర్విధ మదనమార్గణంబులు తెలిసి, భద్ర దత్త కూచిమార పాంచాలురంబోలి, విటవిదూషక నాగరక పీఠమర్దకులయు, చిత్రిని హస్తిని శంఖిని పద్మిని యను చతుర్విధజాతి స్త్రీలయు లక్షణంబుల నెఱింగి బాలాయువతీప్రౌఢాలోలలను స్త్రీలవయః పరిపాకంబు నెఱింగి యనుభవింప నేర్చుచు, చతురికాచారికా సంచారికా దూతికాలక్షణంబుల నెఱింగి పృథివ్యప్తేజోవాయ్వాకాశంబు లను పంచభూతంబులను శబ్దస్పర్శరూపరసగంధంబుల నెడుపంచభూతతత్త్వంబులను త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులను పంచేంద్రియంబులను వాక్పాణిపాదపాయూపస్థలను పంచకర్మేంద్రియంబులను ప్రాణాపానవ్యానోదాన సమానంబులను పంచప్రాణంబులను నెఱింగి ప్రారంభోపాయపురుషసంప ద్దేశకాలవినివిభాగపాత్రప్రతీకారసిద్ధినిశ్చయంబు లను పంచాంగతంత్రంబుల నెఱింగి, ఊఁదుట, వ్రేయుట, మీటుట, వాయించుట, కంచుగీచుటలను పంచమహాశబ్దంబుల నెఱింగి స్త్రీరత్నాశ్వరత్న విద్వద్రత్నాన్నదానపుత్త్రరత్నంబులనియెడు పంచరత్నంబులఁ

దెలిసి, బ్రహ్మయజ్ఞ దేవయజ్ఞ పితృయజ్ఞ ఋషియజ్ఞ భూతయజ్ఞంబులను జేయుచు, గోమూత్ర గోమయ దధి ఘృత క్షీరంబులను పంచగవ్యంబుల నెఱింగి, మిత్రభేద సుహృల్లాభ సంధి విగ్రహ లబ్ధప్రణాశా సంప్రేక్ష్యకారిత్వంబులను పంచతంత్రంబుల నవలోకించి అరవిందా శోక చూత మల్లికా నీలోత్పలంబులను పంచబాణంబులకు లోనుగాక భక్ష్యభోజ్య లేహ్యచోష్య పానీయంబులను పంచవిధాహారంబులను కటుతిక్తలవణ మధురామ్ల కషాయంబులను షడ్రుచుల ననుభవింపుచు, సంధివిగ్రహ యానాసన ద్వైధీభావ సమాశ్రయంబులను రాజ షడ్గుణంబుల నెఱింగి కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులను నరిషడ్వర్గంబు వివర్జించి, హిమ శిశిర వసంత గ్రీష్మవర్షా శరత్తులనియెడు షడృతువుల ధర్మంబుల నెఱింగి నడచుచు, హరిశ్చంద్ర నల పురుకుత్స పురూరవ స్సగర కార్తవీర్యులను సార్వభౌమచక్రవర్తుల చరిత్రంబులవినుచు శైవవైష్ణవ శాక్తగాణాపత్య చార్వాక బౌద్ధంబులను షడ్దర్శనంబులను సముంజైవేదాంత వైశేషిక భాట్ట ప్రాభాకర పూర్వోత్తర మీమాంసలను షట్ఛాస్త్రంబులను పరీక్షించుచు యజన యాజనాధ్యయనాధ్యాపన దాన ప్రతిగ్రహ షట్కర్మ నిరతులైన బ్రాహ్మణుల నరసి రక్షింపుచు, జంబూప్లక్ష కుశక్రౌంచ శాక శాల్మలీ పుష్కరంబు లనియెడు సప్తద్వీపంబులం గీర్తివెలయ,నాందోళికాంబరాభరణవాహన రాజ్య సతీ కర్పూర తాంబూలంబులను నుచిత సప్తాంగంబులు గలిగి సామదాన భేద దండ మాయోపేక్షేంద్ర జాలంబులను సప్తోపాయంబుల నెఱింగి స్త్రీ ద్యూతపాన మృగయా వాగ్దోష దండదోష నిరర్థక వ్యయంబులను సప్త వ్యసనంబులు వర్జించి సుతనిధి దేవగేహ వనతటాక సత్కృతులు నగ్రహారలను సప్త సంతానంబులం బడసి, కవి విద్వత్పౌరాణిక వైతాళిక భట పరిహాసక గాయకులను సభా సప్తాంగంబులం బరివేష్టితుండై లవణేక్షు సురా సర్పి ర్దధి క్షీర శుద్ధోదంబు లనియెడు సప్తసముద్రంబుల నెఱింగి మహేంద్రమలయ సహ్య శుక్తిమ ద్గంధమాదన వింధ్య పారియాత్రంబు లను

సప్తకులపర్వతంబుల నెఱింగి, బ్రాహ్మీ మాహేశ్వరీ కౌమారీ వైష్ణవీవారాహీం ద్రాణీ చాముండలను సప్త మాతృకల నర్చించుచు, స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్ర దుర్గ బలంబులను సప్తాంగంబులు గలిగి, కశ్యపాత్రి భరద్వాజ విశ్వామిత్ర గౌతమ జమదగ్ని వసిష్ఠులను సప్త మహర్షుల నెఱింగి, అయోధ్యా మథురా మాయా కాశీ కాంచ్యవంతికా ద్వారావతు లనియెడు సప్తపట్టణంబులం జూచి, యమ నియమ ప్రాణాయామ ప్రత్యాహారధ్యాన ధారణ సమాధి యోగంబు లనియెడి యోగాష్టాంగంబుల నెఱింగి, దాసత్వము దారిద్ర్యము, దారహైన్యము స్వయంకృషి యాచ్ఞ ఋణము, మార్గము నడచుట యనియెడు సప్తకష్టంబులం బొందక, వరుణుండు, ధ్రువుండు ఆగ్నేయుండు ఉపరిచరుండు ప్రత్యూషుండు ప్రభాసుండునను నష్టవసువుల నెఱింగి యన్న వస్త్ర గంధ పుష్ప తాంబూల వనితాశయన సంగీతంబులను నష్టభోగంబుల ననుభవింపుచు దాసీ బంధు సుత భృత్య వస్తు వాహన ధన ధాన్యంబులను నష్టైశ్వర్యంబులు గలిగి, కులరూపగుణ విద్యా ధన యౌవన బల రాజ్యతపంబులను నష్టమదంబుల నహంకరింపక, కస్తూరి కప్పురకుంకుమ చాఁదు జవాది, అగరు పన్నీరు తెట్టుపునుఁగు గంధమునను నష్టసుగంధ పరిమళ లేపనుండై, శృంగార వీర కరుణాద్భుత హాస్యబీభత్స రౌద్ర శాంతభయానకంబులను నవరసంబుల నావేశంబుగలిగి, ముక్తామాణిక్య వజ్ర వైడూర్యగోమేధికపుష్యరాగమరకత నీల ప్రవాళంబులను నవరత్నగుణవిశేషంబులం బరిజ్ఞాతుండై పద్మమహాపద్మ శంఖ మకర కచ్ఛప ముకుంద కుంద నీల వరములను నవనిధానంబులం గలిగి మరీచి అత్రి ఆంగిరసుఁడు పులస్త్యుఁడు పులహుఁడు క్రతుఁడు భరతుఁడు దక్షుఁడు వసిష్ఠుఁడు నను నవబ్రహ్మల నెఱింగి, సూర్య సోమ కుజ బుధగురు శుక్ర శని రాహు కేతువులను నవగ్రహంబుల విమర్శంబు గలిగి, యింద్రఖండ తరు ఖండ తామ్ర ఖండ చక్రఖండ నాగఖండ సౌమ్యఖండ బ్రహ్మఖండ గభస్తిఖండ భరతఖండంబులను నవఖండంబుల నెఱింగి మఱియు

మభజసనయరతంబులను నష్టగణంబులను, స్వరప్లుతోభయ వృద్ధ్యను స్వార వికల్పప్రాదిభేద బిందుసంయుక్త భిన్నప్రత్యేకవిభాగ కాక్వాదేశ నిత్యాఖండ వర్గచక్రాకృతి పోలికసరసంబులను నిరువది నాల్గువళ్లభేదంబుల నెఱింగి, ఋతు నాయక నవరతి జలకేళీ ప్రయాణ రణ మధుపానార్కోదయ చంద్రోదయమహీపతి పురగిరి మంత్రదూత పరిణయవార్ధ్యాశ్వగజ వన వర్ణనలను నష్టాదశ వర్ణనలం దెలిసి, సంస్కృత ప్రాకృతశౌరసేనీ మాగధీపైశాచికాచూలికాపభ్రంశ తెలుంగులను నష్టభాషలం బ్రవీణుండై ఛందోభంగయతిభంగ విసంధిక పునరుక్తి సంశయాపక్రమవ్యర్థ మహాపర్థంబు విరూపిత శబ్దవిరోధంబులను దశదోషవివర్జితుండై, కుసంధి, దుస్సంధి, చుట్టుప్రాస, వైరివర్గంబు దేశవిరోధంబు కుఱుచకాకు, నిడుదకాకు, తెలుంగులకుం జొఱరాని సంస్కృతక్రియలు, దుష్ప్రయోగంబులను దశవిధాపశబ్దంబులుం జొఱనీయక, నవరసాలంకారంబై ఛందోబద్ధంబై మృదువర్ణవాక్యంబులు గలిగి వాక్యదశదీపితార్థవైభవంబుల నెఱింగి లక్షణలక్ష్యంబులు కావ్యనాటకాలంకారంబులు చెప్ప నేర్చిన సుకవివరులకు నిధి నిక్షేపజలపాషాణాక్షీణాగామి సిద్ధసాధ్యంబులను నష్టభోగతేజస్స్వామ్యసహితంబుగా గృహారామక్షేత్రంబుల నిచ్చి యాదరించి రక్షించుచు, మాతునని చింతించుట, పగచుట, యనుస్మరనుట, కొనియాడుట, సిగ్గెఱుంగకుండుట, అన్నంబరుచికంబగుట, జ్వరమువచ్చుట నాలుకతొట్రుపడియుండుట, జీవంబు తొలంగంజూచుట ప్రాణపరిత్యాగంబు సేయుట యను దశావస్థలమర్మంబులు దెలిసి, వణంకుట, తలనొప్పివచ్చుట గఱగఱికలు విడుచుట ఆత్మమఱచుట తలపోయుట చింతనొందుట, కృశించుట, దైన్యంబు నొందుట దుఃఖియగుట, ఊర్పులంబొరలుట, ఉన్నచోటెఱుంగకుండుట, నిరాహారియగుట, క్రాఁగుట మానంబుం దాల్చుట, అరజీవి తొలంగుట, సంహారియగుట, యనషోడశావస్థలభేదంబు లెఱింగి అంగుష్ఠము, అరకాలు, మండ, మోకాలు, ఊరు, జఘనము. నాభి, కుక్షి, కచము, వక్షము, గళము, అధ

శము, కపోలములు నేత్రములు, ఫాలము మస్తకంబు నను షోడశకళాస్థాన మర్మవిభేదంబుల నరసి, తెల్లదమ్మి, కలువమొల్ల, జిరిసె, మావి, జాజి, పొన్న అశోకంబు, విరవాది, మల్లె, పొగడ, గేదంగి, పాదిరి, కలిగొట్టు, సురపొన్న కదళికా పుష్పంబులను షోడశ బాణంబులను, చిగురువిల్లు, తీగెవిల్లు, తీపువిల్లు, పూవిల్లు నను నాలుగు విండ్ల సంధించి యేయుమనన బాణంబులకు లోనుగాక హావభావ హేలా మాధుర్య ధైర్యలీలా విలాస విచ్ఛిత్తి విభ్రమ కిలికించిత మోట్టాయిత కుట్టమిత బిబ్బోక లలిత కుతూహల చకిత విహృత హాసంబులను పదునెనిమిది శృంగార చేష్టలు గల స్త్రీల చిత్తంబుల నెఱింగి, స్తంభప్రళయ రోమాంచ స్వేద వైవర్ణ్య కంప వాష్ప వైస్వర్యంబులను సాత్త్విక భావంబు లెనిమిది నెఱింగి, నిర్వేదగ్లానిశంకా సూయా మదశ్రమాలస్య దైన్య చింతా మోహా స్మృతి ధృతి వ్రీడా చాపల్య హర్షా వేగ జాడ్య గర్వ విషాదౌత్సుక్య నిద్రా పస్మారసుప్తి ప్రబోధామర్షా వహిత్థా చండమతి వ్యాధ్యున్మాద చరమ, త్రాసవితర్కంబులన ముప్పదిమూఁడు సంచారి భావంబుల నెఱింగి, రతిహాసశో కక్రోధోత్సాహ భయజుగుప్సా విస్మయశమంబులను స్థాయిభావంబుల నెఱింగి జాజి మల్లె మొల్ల విరవాది సంపెంగ సేవంతి తామర చెంగలువ కలుగొట్టు గేదం గి గురువింద పొగడ, పొన్న పాదిరి కరవీరము, అశోకము మంకెన సురపొన్నలా దిగాఁగల పుష్పంబులు, కుసుమ పేరు, పచ్చ, సమ్మేళనంబు ధరియించి చౌసీతి బంధరీబుల రతితంత్రంబులఁ బ్రమదాజనంబులఁ దృప్తిచేయుచు మఱియు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్ర వ్యావహారిక గోరక్షక పాంచాల (పంచాహణ) కుంభకార తంతువాయక్షౌరక రజకవస్త్రచ్ఛేదక చర్మకర్మక పతితకటిలఘాతక లుబ్ధక సంకీర్తక చాండాలమాతంగులను నష్టాదశజాతులు సంకరంబులు గాకుండ నగసి రక్షించుచు బ్రహ్మవసిష్ఠా త్రేయమను పౌలస్త్య రోమశమారీచ నారదశౌనక భృగుచ్యవనగార్గ్య పారాశరంబులను జ్యోతిష సంహితలలక్షణంబును, సౌరజ, రోమకవసిష్ఠ సోమసూర్య సిద్ధాంతంబులను పంచసిద్ధాంతజ్యోతిషశాస్త్రరహస్యం

బుల నెఱింగిన మహాజ్యోతిషి వలనరసిరక్షించుచు, నసి ముసల ముద్గర రోహణ కణయ కంపణ శిల్లు భల్లాతక, భిండివాల కలవాల కుంత కోదండ కఠారతోమర పరశు త్రిశూల వజ్రముష్టి గదా తౌదిలాంగూలంబులు నతళను వంకిణి, చక్రము సబళయీఁటె యినుపకోల సెలకట్టె పట్టెసము, ప్రకూర్మము, నఖురయూరము, దంశనాసంబులను, బత్తి సాయుధంబులనుం బ్రవీణుండై, లారి ప్లువ లక్షణ శుద్ధ చిత్ర దృఢత్వ దూరాపాతంబులు మెఱయ నేర్చి మఱియు మంజరీ పళమంజరీ భూపాల శ్రీరాగ బంగాళ హిందోళ భైరవి గౌళలను పురుషరాగంబు లెనిమిదియును గుజ్జరినారాయణి గుండక్రియ లలిత దేసితోఁడి మలహరి, బవుళి, వేళావతి, ఆందోళి, ఆహరి, భల్లాతకి కన్నడగౌళ ధన్యాసి. ఛాయాగౌళ రామక్రియ, వరాళి మంగళకౌశిక, వరప్రియ, ఖురంజి దేవగాంధారి సాళంగ నాట దేశాక్షి పూర్వగౌళయు నను నిరువదినాల్గు స్త్రీరాగంబుల నెఱింగి మాళవి గౌళరీతి గౌళనారాయణ గౌళచేతాళ గౌళ స్త్రీ వరాళి వసంతవరాళి శోకవరాళి నాగవరాళి పంతువరాళి తోటవరాళి బవుళి రామక్రియ, మేళరామక్రియ, నాదరామక్రియ, సామంతమలహరి చెంచుమలహరి కాంభోది గుమ్మకాంభోది మధ్యమావతిగుజ్జరి సామంత వసంత శుద్ధవసంత మేఘరంజ, దేశాలనాట, హంవీరనాట ముఖారి శంకరాభరణ హేజిజి పాతికరంజి నీలాంబరియనియెడుముప్పదిరెండు నపుంసక రాగంబుల నెఱింగి, మాళవి శ్రీ దేవగుప్తి సావేరి కొండమలహరి కోనమలహరి శ్వేతకాంభోది దీపకంబు పంతులాదిగాఁగల మిశ్రంబులను, వేళలు, మైత్రియు, శ్రుతి జాతివర్ణంబులును శుద్ధసాళగసంకీర్ణంబులను స్థానప్రపంచ విస్తారంబులును, తతా వనద్ధ ఘన, సుషిరంబులను గీతవాద్యంబులను మంద్ర మధ్యమతారంబులను స్వరభేదంబులను సకల మోహన సంగీత విద్యా విశేషంబుల నెఱింగి చర్చరి, చారణి బహు రూపలక్షణ చాగుడంబు శుద్ధపద్ధతి ప్రేంఖణపద్ధతి, కుండలి నృత్యంబు దండలాసకంబు బాడికంబు రాసకాఖ్యంబు పాపరాశికంబు కందుక కోలాట

కంబులను షోడశ విధ నృత్య ప్రకారంబుల నెఱింగి ఛప్పన్నదేశభాషాప్రవీణుండై యక్షరలక్షణ వేద శాస్త్ర పురాణేతిహాస శిక్షావ్యాకరణ నిరుక్తచ్ఛందో జ్యోతిషాలంకార వశ్యాకర్షణ స్తంభనోచ్చాటనమారణ విద్వేషణాదృశ్య సంచు పరకాయ ప్రవేశగణిత లిఖిత గాంధర్వ వీణావేణుమృదంగతాళనృత్యక విత్వహారతోర్వ ద్వారత్వ సంగ్రామలక్షణ మల్లయుద్ధ బేతాళమత చిత్రకర్మముష్టిమోహనేంద్రజాల మహేంద్రజాల రథగజాశ్వ జన రత్న భూపరీక్షా యోగశాస్త్ర మంత్రశాస్త్ర శకునశాస్త్ర శిల్పశాస్త్ర వైద్యశాస్త్ర మదనశాస్త్రాగ్ని స్తంభన జల స్తంభన ఖడ్గ స్తంభన దృష్టి స్తంభన జిహ్వా స్తంభన శుక్ల స్తంభన రసవాద పీలువాద కాష్ఠవాద ధాతువాద గారుడంబు లనియెడు చౌషష్టివిద్య లందుఁ బ్రవీణుండై, మఱియు మహాప్రధాన మాండలిక సామంత సేనాధిపతి ద్వారపాలకావసర ఘటీకార పణిహార రాయభార గణక విజిర పురోహిత, పౌరాణిక, జ్యోతిషిక, కావ్యక విద్వ ద్దేవార్చక మాల్యకార పరిమళకరండాధికార గోష్ఠాధికారగజాధికా రాశ్వాధికార వస్త్రాధికారధాన్యాధికారోగ్రాణి కాంగరక్షక సూచ సువ్వారిక చాణూరవేతాళ తాంబూలికాల పట్టికా నరవాహన ఛత్రక చామరక కాళాంజిక కతారిక పాపుడక నాట్యక హింకారిక కట్టిక భట్ట పాఠక పరిహాసక క్షౌరక రజక వస్త్రచ్ఛేదక చర్మకర్మకాడియాళక పురపాలక వనపాలక నరవైద్య గజవైద్యాశ్వ వైద్య పశువైద్య కాహళక, భేరిక, మృతాపక కారుక, సువర్ణకారక కుంభకారక చిత్రక వ్యావహారిక కొట్టికమృగయాత్రక పక్షియాత్రకులనియెడు (కొన్నితప్పులు?) బాహత్తరని యోగంబులుఁగలిగి వ్రీహి యవ మాష తిల ముద్గ కులుత్థ గోధూమ ప్రియంగు మసూరశ్యామాక నీవార వైణవము లను ద్వాదశధాన్యసంగ్రహణుండై, తులాపురుషహిరణ్యగర్భ బ్రహ్మాండ కల్పవృక్షసహస్రధేను హిరణ్యకామధేను సువర్ణ రథ హేమమహాస్తి కనకలాంగూల పంచమహాగ్రహ విశ్వచక్ర రత్నధేను భూత ఘటదానంబులను(?) షోడశమహాదానధరంధరుండై ధ్యానావాహనాసనార్ఘ్య పాద్యాచమనీయ స్నానవస్త్ర యజ్ఞోపవీత గంధాక్షత పుష్పధూపదీప నైవే

ద్యతాంబూలంబులను షోడశోపచారపూజావిధానుండై యార్యధర్మంబు నప్ప
క వర్తించుచువాఁడు సభాపతి యనంబరగు.

## ప రి శి ష్ట ము.

### హరిహరరాయలు.

ఉ. హరిహరదేవ నీ ఐవినతారుల నద్భుతలీలఁ ద్రుంపఁగాఁ
గరికరి వాజి వాజి నవఖండవిఖండవిఖండ ధారలై
యరుదుగ నీదు హేతిజశరాగ్నులఁ బర్వుచు నెప్పుడుండురా
ధరధర ధారధార ధరధార ధరాధర ధారధారలన్. [?]

### తిరువ శేంద్రుఁడు.

లయ. నిగనిగని చన్నులును నగుమొగములున్ సకస
కగు నడుములు నొప్పు జిగి నమరకాంతల్
నగధరుఁడు మెచ్చ భవదగణితగుణౌఘముల
నాగి థిమికి థింధిమికి దిగుద్ధిమి ధిమి తోం
దిగుద్దిగి దిగుద్గణ తగుద్ద తతతోం తగణ
జగుధగిణ తత్తిగణ తెగుద్ద తత తత్తై
జగుద్గిణ తాతిగణ తగుద్దతతతాయనుచు
మిగుల నటియింపుదురు తగఁదిరువశేంద్రా!

### సాగిపై చరాజు.

సీ. కూలత వైరిరాజులఁ గాని జక్కున
ద్రేయవు మాన గోవిందరాయ
అది లావు నిదిఘనం బనుదళంబులఁగాని
చొచ్చి నరుఁడవు దివిచూఱకార

ప్రధనదత్తుఁడు మహాబలుఁడగు నృపుగాని
యొఱయఁవు రాయరాహుత్తమిండ
షట్ఖానుఖానాది బలుదుర్గములుగాని
కొన విలఁ బురియమార్గాలు గండ
గీ. గండభేరుండ యుత్తమ గంపబిరుద
వీరకేదార రణరంగ వీరభద్ర
సత్యగుణహార సాగిగన్నయకుమార
బళిర భైచాముహాపాత్ర బహుచరిత్ర.
సీ. బహుముఖ బ్రహ్మాండ భాండంబు దివెగూడు
సంపూర్ణవీరంసంబు చమురు
భీమప్రతాపార్క బింబంబు తిరువత్తి
విజయసంగరభూమి వేఁటపోలము
పంచమహాశబ్ద బంధంబు గంటలు
కరవాలభైరవాకార మంబు
మేటివైరుల పాలిమృత్యువు చొప్పరి
సహజసన్నాహంబు శక్తిగాఁగ
గీ. రాత్రిపగ లన కేప్రొద్దు రాజసమున
వేటవేటాఁడె దహితమృగములు సమయ
కాంతి హిమధామగండరగండ నామ
శత్రునారాచ గన్నయ సాగిభైచ.
సీ. నెరవుగాఁ జేరిననెత్తురుదబ్బలు
గుబులుతుగా నంటిన క్రొవ్వుపొరలు
మొపుపట్టలమీఁద మెదలాడు ప్రేవులు
చెదరి చించినగుండె చేరుగుదులు

మాలైనకుప్పలు మాంసఖండంబులు
చరణముల్ కరములు శల్యములును
మొదలికినూడిన మూలుగుకోడుపులు
పవనంబు వోవనిపచ్చితలలు
గీ. కండకూరొద్ద భూతాలు కలసి మెసఁగ
ఘూనమల్కుల గెల్చు పేఘునము నీకు
బల్లసురథాణబిరుద సంపాదపాద
శత్రునారాచ గన్నయసాగిభైన.

సీ. పులితలాటంబుకై కలహించుచా మెల్ల
మలయకునని [?] రేకుమడఁగగొట్టి
నెఱిగండభేరుండ బిరుదుకై పట్టిన
వెల్లంకులను నాజి విరుగఁద్రోలి
మునుక రక్తక్షేత్రమునకునై యొరసిన
యినుగంటితిమ్మని నన్నెపణంచి
బల్లెసురత్రాణపట్టు బిరుదముకై
సెట్టిపల్ రాఘువుచేఁత చెఱిచి
గీ. మఱియుఁ దక్కినమన్నీలనురుము చేసి
మించె నీకీర్తి దిక్కుల మేదినందు
బల్లసురధాణ బిరుదసంపాదపాద
శత్రునారాచ ! గన్నయసాగిభైచ.

క. ఈసాగి భైచభూవరుఁ
డీసాగిన మొదలు నర్థులేచిరి సిరులన్
రా సాగి బల్లెమందిన
పోసాగిరి వైరులింద్రపురికిని నమరన్

మ. సరసాగ్రేసర సాగిగన్నయయకుమారా బైచిభూపాల యు
ద్ధరణిన్ నీ కరిగోరు చెల్లునట చిత్రంబా తలంపంగ ని
ర్భరతారుణ్యవధూవిజృంభ యగురంభానారిపాలిండ్ల నీ
యదిగో రెంతయుఁ జెల్లుచుండునట జంభారాతి లోకంబునన్.

వాసిరెడ్డి వేంకటాద్రినాయఁడు

సీ. అంగుగా నపరంజి యంచుచీరె ధరించి
రంగైన మేలుంగార్లు రవికఁదొడిగి
రమణు లందియ్యఁగా రహి రత్నఖచితమౌ
సొమ్ము లందంబుగ సొరిదిఁ దాల్చి
చెలికత్తెపై నొక్క చెయివైచుకొని, స్వామి
యింతప్రొద్దాయె రాఁ డేమటంచు
నెల్లిపూదండచే నల్లిన చల్లని
సురటిచేఁ బూని యచ్చోటనిలచి
గీ. రాకపోకల నిన్నె పరాకుమాని
యరయుచున్నది యదిగో మాయమ్మ సాధ్వి
పరమదనకోటిలావణ్య వాసిరెడ్డి
వేంకటాద్రీంద్ర మన్నెహం వీరచంద్ర!

రాజనీతి.

ఉ. మానమె భూషణంబు చనుమానమె సౌఖ్యకరంబు నిర్మల
జ్ఞానమె ముక్తికాస్పదము గానమె విద్యలకెల్లరాజు సం
తానమె పో ఫలంబు మహిధర్మమె తోడు తలంపఁగా నుదా
శీనమె వీడకోలు గుణశేఖర పెమ్మయసింగధీమణీ!

సీ. మగనాలి మాఁదను మమత యుంచఁగరాదు
పగవానితో మించి నగఁగరాదు

నగరివాకిలినంటుమగువలఁ బిలరాదు
పతికాప్తుఁ గోపించి పలుకరాదు
చలపట్టి దొరతోడ సరిపడదనరాదు
చనవరితోఁ గంటు కనఁగరాదు
ప్రభువు చెప్పకయె తాఁ బనులు చేయఁగరాదు
పిలక దగ్గఱఁ బోయి నిలువరాదు

గీ. పరుసం బా రాజుమొనచూపి పలుక రాదు
పగఱ యధికత స్వామితోఁ బొగడరాదు
నరులకెల్లను నీనీతి నడవ వలయుఁ
ప్రకట గుణసాంద్ర ! కంభము రామచంద్ర!

సీ. తలవరితోఁ మించి కలహింపఁ గా రాదు
స్త్రీలస్వతంత్రలఁ జేయరాదు
జాతిదప్పినయట్టి నాతిఁ జేకొన రాదు
నీతిమాలిన యెడ నిలువ రాదు
ప్రభువు సమ్ముఖమునఁ బకపకనగరాదు
చనవునగర్వంబు గనఁగరాదు
తలఁపెఱుంగక యతికూతుఁ గైకొనరాదు
పరునికల్మి కసూయపడఁగరాదు

గీ. పదరియాసల ధర్మంబు వదలరాదు
చలము బొంకును సుజనుతోఁ జలుపరాదు
నరులకెల్లను నీనీతి నడవవలయుఁ
ప్రకటగుణ సాంద్ర ! కంభము రామచంద్ర.

సీ. అక్కఱకొదవనియర్థంబు వ్యర్థంబు
బంటుతన్నము లేని భటుఁడు నటుఁడు

కసికుఁడేలనియట్టి రాజ్యంబు త్యాజ్యంబు
శీలంబువలఁపనియాలు తేలు
మాటతప్పఁగనాఁడుమనుజుండు దనుజుండు
గౌరవంబెఱుఁగని యూరుపోతు
ధర్మంబుమానిన దానంబు హీనంబు
నయముమాలిన వానినంటు కంటు
గీ. పొదలు తమిఁ బూసనిలతాంగి పొందుమందు
చెలఁగి సజ్జనుల్ మెచ్చని చేఁతరోఁత
యిష్టబంధులు నిండని యిల్లుపొల్లు
ప్రకటగుణసాంద్ర ! కంభము రామచంద్ర.

## ప్రార్థనము.

సీ. నిఖిలభూధరవరకీ నిమ్నోన్నతస్థలీ
విహరణాగతమైన వెనుకబెణుకుఁ
రమిరక్షణార్థమై యమహాత్మ్యవాటంబుఁ
బగులఁదన్నిననాఁటి ప్రాఁతనొప్పి
బ్రహ్మాదిసకల నిర్జరకృతార్చనకాల
మున నిల్వఁ బట్టిన మొనయుగుడులు
సైకాంఘ్రిపైనిల్పి నృత్యమత్యంతంబు
విరచించునాఁటితిమ్మిరియుఁదీఱ
గీ. తోమి గ్రుద్దెదఁ జిసికెద ధూళిదుడిచి
వ్రేళ్లవిఱిచెదఁ జూపవే కాళ్లు తల్లి
నిగమసు[illegible]రి యెలకుర్తి నగరవర్తి
యీశమల్లేశలింగ [illegible]తనూశతాంగ.



సమాప్తి.

మ. [illegible]త్వమును నైత్వం బాత్వముం బొట్టులున్
బలుసో[illegible]గంబులు, విరామప్రాసశబ్దాదు లిం
దులఁ జేతప్పునఁ దప్పు నజ్ఞుఁడను నన్ దూషింప కాతప్పు లొ
ప్పులుగాఁజేయుఁడు పెద్దలార! మిము నేఁబ్రార్థున్ ప్రార్థించెదన్.

శ్లో. విసర్గబిందు మాత్రాది
పదపాదాక్షరాది చ
న్యూన మప్యతిరిక్తం వా
క్షమస్వ పురుషోత్తమ !